# MANI MANJUSHA

## Prose & Poetical Selections
from
## Telugu Literature

### PART I

FOR THE USE OF FOURTH FORM.

*Vid*  *aswati,*

JU,

Telugu Pandit, Board High School, Uravakonda.



E. M. GOPALAKRISHNA KONE,

MADURA & MADRAS.

 *1933* [*Price As.* 10.

# మణిమంజూష

(గద్యపద్యాత్మకము)

## మొదటి భాగము

నాల్గవ ఫారము

కూర్పరి :

విద్యార్ణవ, సాహిత్యసరస్వతి,

నూ. పేరరాజు,

ఆంధ్ర పండితుఁడు,

బోర్డు హైస్కూలు, ఉరవకొండ.

ప్రకాశకులు :

ఇ. మా. గోపాలక్రిష్ణ కోనుగారు,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్,

మధుర : చెన్నపురి.

 1933 [వెల అణా 10.

# INTRODUCTION.



It is with extreme pleasure that I write these few lines, by way of introduction to the Selections in Telugu Prose & Poetry, Parts I & II, compiled by Vidyarnava, Sahitya Saraswati. Brahmosri, Nutalapaty Pera Raju Garu, Telugu Pandit, S. K. Board High School, Uravakonda.

He is well known to the public and the students of this and the neighbouring Districts, as the author of several books among which may be mentioned *Vaidarbhi Vilasam*, *Gnanadipika* & etc. He has also been publishing Text Examiners in Telugu for the S. S. L. C. Examination, for the past three years and the large sale that the books have been commanding speak highly of their utility and popularity.

With his wide experience of teaching Telugu in the High School forms, he is a very good judge of the standrad of attainments expected of the average students of the High school forms and, as such, the books are sure to provide just the material which will be beneficial and which will suit the standard of the classes for which the books are intended. The selections themselves are mostly from the great works in Telugu Literature and have been chosen with an eye to their caltural Value and their appeal to the higher sentiments of the Telugu speaking public. Care has also been taken to include passages specially noted for their beauty of language and superiority of diction.

Part I is intended for use in form IV and Part II in form V. Brief annotations are also added at the end of each part in accordance with the provisions of the revised S. S L. C. Scheme.

I am confident that the books will, on account of their excellence, meet with a very warm reception at the hands of the Pandits and pupils in the Telugu Districts and will enjoy the popularity they deserve.

S. K. B. High School,
Uravakonda,
21-2-1933.

P. RAGHAVENDRACHAR,
B. A., L. T.,
*Head - Master.*

# విషయసూచిక.



## పద్యవిభాగము.



## గద్యవిభాగము.

# మణిమంజూష

## మొదటి భాగము

౧

శ్రీమదాంధ్ర మహాభారతము - ఆది పర్వము

### ఏకలవ్యుని గురుభక్తి



నరుఁడస్త్ర శస్త్ర విద్యా
పరిణతి నధికుఁడయి, వినయ పరుఁడయి, శశ్వ
ద్గురు పూజా యత్నంబునఁ
బరఁగుచు, సంప్రీతుఁ జేసె భారద్వాజున్. 1

సీ. అతని యస్త్ర విద్యాభి యోగమునకుఁ,
బ్రియ శిష్య వృత్తికిఁ, బెద్ద మెచ్చి,
'యన్న! ధనుర్ధరు లన్యులు నీకంటె
నధికులు గాకుండు నట్లు గాఁగఁ
గఱపుదు విలువిద్య ఘనముగా' నని పల్కి
ద్వంద్వ సంకీర్ణ యుద్ధముల తెఱఁగు,
రథ మహీ వాజి వారణముల పై నుండి
దృఢ చిత్ర సౌష్ఠవ స్థితుల నేయ,
బహువిధ వ్యూహ భేదనోపాయములను
సంప్రయోగ రహస్యాతిశయము గాఁగఁ
గఱపె, నర్జునుఁ దొంటి భార్గవుఁడు వింట
నిట్టిఁడే యని పొగడంగ నెల్ల జనులు. 2

వ. మఱియు, గదా కార్ముక ప్రాసాసి తోమర కుంత శక్త్యాది వివిధాయుధంబుల యందును గుమారుల నందఱ జితశ్రములం జేయుచున్న ద్రోణాచార్యుల మహా ప్రసిద్ధి విని, హిరణ్య ధన్వుం డను నెఱుకరాజు కొడుకు నేకలవ్యుం డనువాఁడు ధనుర్విద్యా గ్రహణార్థి యయివచ్చిన వాని నిషాదపుత్త్రుండని శిష్యుంగాఁ జేకొన కున్నవాఁడును ద్రోణు ననుజ్ఞ వడసి చని వనంబులోన. 3

గీ. వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి,
దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ
జేసి, మ్రొక్కుచు, సంతతాభ్యాస శక్తి
నస్త్ర విద్యా రహస్యంబు లర్థిఁ బడసె. 4

క. ఇటఁ బాండవ కౌరవు లొ
క్కొట నందఱు గురుననుజ్ఞఁ గొని, మృగయాలం
పటులై, వనమున కరిగిరి
పటుతరజవ సారమేయ భట నివహముతోన్. 5

వ. మఱియు, నందొక్క భటుని కుక్క తోడుఁదప్పి పఱచి యొక్కెడ నేకతంబ యేయుచున్న యేకలవ్యు సమీపంబున మొఱంగిన నయ్యేలుంగు విని, దాని ముఖం బునం దేడు బాణంబు లొక్కటఁ దొడిగి యక్కజంబుగా నతి లాఘవంబున వాఁ డేసిన నది శరపూరితముఖంబయి కురు కుమారుల యొద్దకుం బాఱిన దానిం జూచి విస్మయంబంది, యట్లేసిన వాఁడెవ్వఁడో యని రోయుచు వచ్చువారు ముందఱ. 6

ఉ. తేజిత బాణహస్తు, దృఢ దీర్ఘ మలీమస కృష్ణ దేహుఁ, గృ
ష్ణాజిన వస్త్రు, నస్త్ర విషయాప్త విషాదు, నిషాదుఁ జూచి యా
రాజ కుమారు లందఱుఁ బరస్పర వక్త్ర విలోకన క్రియా
వ్యాజమునం దత్క్షణ నివారితులై రతిమత్సరంబునన్. 7

వ. ఆకుమారులు వాని శరలాఘవంబునకు మెచ్చి, నీ వెవ్వండ వెవ్వరిచేత విలు విద్యఁ గఱచితని యడిగిన, వారికి నయ్యెఱు కిట్లనియె. 9

క. వినుఁ డే హిరణ్యధన్వుం
డను వనచరనాథు కొడుక; నాచార్యుఁడు ద్రో
ణునకుఁ శిష్యుఁడ; నెందును
ననవద్యుఁడ; నేకలవ్యుఁ డనువాఁడ మహిన్. 9

వ. అనిన విని కుమారులందఱు మగుడ వచ్చి ద్రోణునకు నంతయుఁ జెప్పి; రంత నర్జునుం
డొక్కనాఁ డేకాంతంబున నాచార్యున కిట్లనియె. 10

క. 'విలువిద్య నొరులు నీక
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని ము౯
బలికితిరి: నాక కాదీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెఱుక౯. 11

క. నాకంటెను, మీకంటెను,
లోకములో నధికుఁ, డతిబలుండు, ధనుర్వి
ద్యాకౌశలమున నాతఁడు
మీకుం బ్రియ శిష్యుఁడఁట యమిథ్యావచనా!' 12

వ. అనిన విని ద్రోణుం డదరిపడి, 'వానిం జూతము రమ్మ'ని యర్జునుం దోడ్కొని,
యనవరత శరాసనాభ్యాస నిరతుండై యున్న యేకలవ్యు కడకేగిన నెఱింగి, వాఁడు
నెదురు వఱతెంచి, ద్రోణునకు మ్రొక్కి, తన శరీరంబు నస్త్ర శస్త్రంబులు సర్వం
బును నివేదించి, 'యేను మీ శిష్యుండ; మిమ్మారాధించి మీ ప్రసాదంబున
నివ్విలువిద్యఁ గఱచితి'నని కరకమలంబులు మొగిచియున్నం జూచి, ద్రోణుం
'డట్లేని మాకు గురుదక్షిణ యిమ్మ'నిన సంతసిల్లి వాఁ డిట్లనియె. 13

క. 'ఇది దేహం, బిది యర్థం,
బిది నాపరిజన సమూహ, మిన్నిటిలో నె
య్యది మీకిష్టము దానిన
ముదమొదవఁగ నిత్తుఁ గొనుఁడ మోఘంబ'నిన౯. 14

క. 'నెమ్మిని నీదక్షిణ హ
స్తమ్మున నేను వ్రేలు దునిమి దక్షిణ యిమ్మి
ష్టమ్మిది నాక'నవుడు, విన
యమ్మున వాఁ డిచ్చె దాని నాచార్యునకు౯. 15

గీ. దక్షిణాంగుష్ఠ మిచ్చిన దానఁ జేసి
బాణ సంధాన లాఘవ భంగమైన
నెఱుకు, విలువిద్య కలిమికి హీనుఁ డయ్యెఁ,
బార్థునకు మనోరుజయును బాసె నంత. 16

యుండుదు, లెదు లేచినఁ దుది
మండుదు. రార్వంగరాదు మఱియెవ్వరికిన్. 55

క. తమ తండ్రి భంగి నీకును
సముచితమగు భక్తిసేసి సజ్జనమా
ర్గమున నడచువారల నీ
వమలమతిం గన్నకొడుకు లట్లరయఁదగున్. 56

వ. అని పలికి మఱియు నిట్లనియె. 57

క. కారణము లేకయును నుప
కారపరత్వమున నొరుల కార్యంబులకున్
వారని యలజడిఁ బడియెడు
వారలచూ యేడుగడయు వారికి నధిపా! 58

చ. ఒకరుని చేతఁ బ్రోవునఁ దదున్నతి ప్రాపునుగాంచి యెల్లవెం
టసను గొఱంతలేక పొగడందగు సంపదనొందె, యట్టిదా
తకుఁ దుదిఁ గీడుసేసిన కృతఘ్నుని పీనుఁగునైన నక్కల పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా! 59

వ. కావునఁ, గృతము దలంపమి గీడు. పాండురాజు నీకుం బరమ భక్తుండు. పాండవులునుం దేజోలాభంబులు గావించినవారలు. వారల నాదరింపుముని చెప్పి వెండియు నిట్లనియె. 60

ఆ. బ్రదుకు, చేటు, పొగడువడుట, దూఱొందుట,
యీగి, వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కింతయేల వగవ నధిప! 61

క. వగబలము దఱుఁగు, రూపఱు,
వగచిన మతిదప్పుఁ, దెవులు వచ్చును, దూఱున్
వగచి నలంగినఁ బ్రియమగుఁ,
బగతురకును, వగచుటుడుగు పార్థివముఖ్యా! 62

చ. అనవుడు నిట్లను న్విదురుఁ, డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును, జెలికాఁడునుం, దగుభటుండును, బ్రెగ్గడయున్, గురుండుఁ గాఁ
డె నృపవరేణ్య! నీకుఁ, బ్రకటీకృత సత్యుఁడు, శాంతమూర్తి, స
ద్వినయ వివేక శీలముల విశ్రుతుఁ, డాతఁడు గీడువల్కునే. 6

ఆ. నీవుఁ గొడుకు వారి నెటిలేక పెంచితి
కదియుచాలు, సుచితమైన పాలు
పంచియుండు † పిల్లిపట్టిన యెలుకవు
నీసియున్న నేల చెల్లనేర్చు. 7

వ. మీరు శకుని కర్ణ దుశ్శాసనులమీఁద రాజ్యభారంబు పెట్టికొనియుండుదు రది దుదిముట్ట నేర దెట్లంటేని. 8

క. తమకుఁ దారెఱుఁగుట, వేగ ప
డమి, దాలిమి, విడుపుగలుగుటయు, లేని ప్రభు
త్వము గలదె? వారి యంతి
సుమానుషము లోకుఁడుఁ బట్టి చూడం గలఁడే. 9

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కము తండ్రివని తగవునమ్మి చాల సైరించియున్న వాఁ డది నీవ యెఱుంగుదు వనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 10

గీ. సంజయునిచేతఁ గార్యంబు చందమెల్ల
యెఱిఁగి మనకెద్ది సేయంగఁ దెఱఁగు, దానిఁ
బనిచి చేయింపు, మిపుడు నామనము దల్ల
డిలుట హిత భాషణంబుల డిందుపఱుపు. 11

---

† తొల్లి యొక ముసలిపిల్లి ధాన్యపుఁ గొట్టునందు విచ్చలవిడిగఁ దిరుగు నెలుకల నన్నిటిఁ బట్టఁ దలఁచి రుద్రాక్షలు ధరించి యేకాంత ఋషి చర్య నుండె. ఎలుక లన్నియు నెల్లవేళల నామార్జాలముకడ కేఁగి, దాని కపటోపాయముల నెఱుంగఁజాలక, నిర్భయముగ దానిపై గంతు లిడుచుండెను. ఒక నాఁ డాపిల్లి యెలుకలఁ గాంచి, ఓ యెలుకలారా! ఇచ్చట ధాన్యము తఱుఁగుచున్నది. ఒక్కచోఁ దఱుఁగని ధాన్యముగల కొట్టుగలదు. మీరందు వసింతురేని సుఖం బుందురు. అందఱ నొక్కసారిగఁ గొనిపోఁజాల. ఒకొక్కరినె కొనిపోయెద నని నమ్మఁ బలికి, నానాఁ డన్నిఁటిఁ గొనిపోయి యిచ్చచొప్పున భక్షించెను.

వ. నీవు ధర్మవిదుండవు, నయానయజ్ఞుండవు, నాకుం బ్రజాగరం బొనర్చుచున్న సంతాపం బుపశమించునట్లుగా భవద్వచనామృతంబు నా యుల్లంబున వెల్లి గొల్పు'మనిన విదురుం డిట్లనియె. 12

క. జనులకు నోడంబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, మీఁ
దని యొకని కలిమి కులుకక,
మనుజులతోఁ బొంది పొసఁగి మనుటొప్పు నృపా! 13

క. కోపము, నుబ్బును, గర్వము,
నాపోవక యునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము, ననునివి
కాపురుష గుణంబులండ్రు కౌరవనాథా! 14

క. ఏలినవానిని, దైవము,
నాలిని, బంధులను, సముచి తారాసన సం
శీలతఁ బ్రీతులఁ జేయని
పాలసుఁడా ఫలము లాసపడు మనుజేంద్రా! 15

క. నెమ్మిగల వారి నొల్లరు,
తమ్మొల్లని వారివెనుకఁ దగులుదు, రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు
రిమ్మెఱుఁగని యట్టివార, లిభపుర నాథా! 16

క. ధనమును, విద్యయు, వంశం
బును, దుర్మతులకు మదంబుఁ బొనరించును; స
జ్జనులైనవారి కడఁకువ
యును, వినయము, నివియ తెచ్చు నుర్వీనాథా! 17

క. అరిది విలుకాని యుజ్జ్వల
శర మొక్కని నొంచుఁ, దప్పించనినం జను, నే
ర్పరియైన వాని నీతి
స్ఫురణము పగరాజు నతని భూమిం జెఱుచుఁగా. 18

గీ. † ఒకటిఁ గొని, రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి,
మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి,
యేనిటిని గెల్చి, యాఱింటి నెఱిఁగి, యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. 19

క. విను మధురాహారంబులఁ
గొనుటయుఁ, బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే
ల్కని యునికియుఁ, గార్యాలో
చనముఁ దెరువు నడచుటయును, జనదొక్కనికిన్. 20

క. నడవడి యను మున్నీటిం
గడవం బెట్టంగ నోడకరణిం దగి, తా
నొడఁగూడు ననిన సత్యము
గడచిన గుణమింక నొండుగలదే యరయన్. 21

† ఒకటిన్ = బుద్ధిని, కొని = కలిగి, రెంటిన్ = ధర్మాధర్మములను, నిశ్చల యుక్తిఁజేర్చి = చక్కఁగా నిశ్చయించి, మూఁటిన్ = శత్రుమిత్రోదాసీనులను, నాల్గింటన్ = సామదాన భేదదండముల చేత, కడున్ = మిక్కిలి, వశ్యములుగఁజేసి = వశపఱచుకొని, ఏనిటిని = పంచేంద్రియములను (త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు) కొల్చి = జయించి, ఆఱింటిన్ = సంధి విగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులనియెడు షడ్గుణంబులను, ఎఱిఁగి= తెలిసికొని, ఏడున్ = సప్తవ్యసనంబులను, విడిచి = విడిచిపెట్టి, వర్తించువాఁడు = మెలఁగువాఁడు, వివేకధనుఁడు = బుద్ధిగలవాఁడు.

ఆత్మ పరమున—ఒకటిఁగొని = పరమాత్మయొక్కఁడని యెఱిఁగి, రెంటిన్ = జీవాత్మ పరమాత్మలను, నిశ్చలయుక్తిఁ జేర్చి=చక్కఁగాఁగలిపి, మూఁటిన్ = కామ క్రోధ లోభములను మూఁడింటిని. నాల్గిఁటన్ = శమ, దమ, ఉపరమ, శ్రద్ధలను నాల్గింటిచే, కడున్ = మిక్కిలి, వశ్యములుగఁ జేసి = వశపఱచుకొని, ఏనిటిన్ = పంచేంద్రియములను, గెల్చి = జయించి, ఆఱింటిన్ = క్షుత్పిపాసా శోక మోహ జరా మృత్యువులను, ఎఱిఁగి = తెలిసికొని, ఏడున్ = సప్తావరణములను (పృథివ్యప్తేజో వాయ్వాకాశా హంకార మహత్తత్త్వములను) లేక, పంచేంద్రియములను, బుద్ధి, మనస్సును, విడిచి = దాఁటి, వర్తించు వాఁడు = మెలఁగువాఁడు, వివేకధనుడు = జ్ఞాని.

క. క్షమియించు వారిఁ గని చా
లమి బెట్టుదు, రైగనుం దలంప ననూన
క్షమయ కడుం బెంపయియు తోడ, వు
త్తమ రూపము గోరువారు దాల్తురు దానిన్. 22

క. పురుషుండు రెండుదెఱఁగుల
ధరను త్తశుఁ దనఁగఁ బరఁగుఁ ; దా వెయ్యెడలం
బరుసములు వలుక కునికిన్,
దురితంబులు వొరయుపనులు దొలఁగుటకతనన్. 23

గీ. చెల్లియుండియు నైరణ వేయు నతఁడుఁ,
చేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ, బుణ్య
పురుషులని చెప్పి రార్యులు గురువరేణ్య! 24

గీ. పొడి దప్పకుండఁ బడయు సొమ్ములను న
పాత్రములకు నీగి, పాత్రములకుఁ
బెట్ట కునికి, యనఁగ నెట్టన రెండు వి
ధములఁ గీడు దొడరు ధరణినాథ! 25

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁ, బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత,
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల. 26

గీ. తగిన వేషంబు, దనుఁ దాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దనకెంత నడవకయున్నఁ బథము
దప్పకుండుట, నడవడి కొప్పు సేయు. 27

క. చెలిమియు, సంభాషణమును,
బలిమి వివాదంబుఁ ద్రోపుఁ బాడియు, దమయం
తల వారి తోన తగు నధి
కుల, హీనులతోడ నైనఁ గొఱగా దధిపా! 28

గీ. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు;
పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము; శత్రునకునైన
విచ్చుటయ లెస్స; యడిగినయెడ, నృపాల!. 29

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుఁడు, వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక
యును దన దెసఁ దోపనీక యుడుపుచు వచ్చున్. 30

వ. ఇట్టి చందంబులు ధర్మనందనునకుం గలవ'ని పలికి విదురుండది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి, 'నీవువారలం బెనిచి మానిసులఁజేసి, రక్షించి, యిప్పుడుపేక్షించి, వారలు వెలినుండ నూరకుండందగునే? తగుపాలిచ్చి వారిరావించి నీకొడుకులతోడి వారింగా నడపుట యుచితంబు. మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడరాద'నిన నమ్మాటలు వెడవెడయాఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 31

గీ. 'హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగఁ జెప్ప,
ధర్మసుతు చందమును విదితంబు నీకు,
నట్లు గావున నెఱిఁగింపు మఖిల కార్య
జాతమును జిత్తతాపోపశమము గాఁగ.' 32

క. అనవుడు విదురుఁ డాతనికి
ట్లను, 'నిమ్మెయి నన్ను నొత్తియడిగినఁ జెప్పం
జను నున్నరూపు సెప్పెద
విను మవధానంబుతోడ విమలవిచారా! 33

ఉ. దక్కను రాజ్యమంచు నకటా! యిటు దమ్ముని భాగమీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది యెట్లులుగుఁ గో, విను, మీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగిన చాడ్పు నూనె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే.' 34

క. అన విని నిరుత్తరుం డయి
మనుజేంద్రుఁడు గొంతసేపు మ్రాన్పడి, తలఁపుల్

తెనఁ గొన, నిద్రాహీనిం
దను వలయఁగ, విదురుతోడఁ దా నిట్లనియెన్. 35

క. ఇందాఁక నీదుపలుకుల
డెందము తాపంబు గొంత డిందుపడియె ; నా
కుం దగ నయానయంబుల
చందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ ! 36

వ. అనిన విని విదురుండిట్లనియె. 37

ఆ. తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి
చేటె కాదు విత్తుచేటుఁ గలుగుఁ ;
బక్వమైనఁ గొనిన ఫలమించుఁ జెడదు బీ
జంబుఁ, గార్యసిద్ధి చంద మిట్లు. 38

గీ. మాలకరి పువ్వములు గోయుమాడ్కిఁ, దేఁటి
పువ్వుఁ దేనియఁ గొనియెడు పోల్కి, నెదురు
గంద కుండఁగఁ గొనునది కార్యఫలము ;
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. 39

క. పరుల ధనమునకు, విద్యా
పరిణతికిం, దేజమునకు, బలమునకు, మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులు లేని వేదనఁబడు నధిపా ! 40

క. ఎదిరికి హితమును, బ్రియమును,
మదికింపును గాఁగఁ బలుకు మాటలు పెక్కై
యొదవినను లెస్స, యటుగా
కిది యదియన కూరకునికి యెంతయు నొప్పున్. 41

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం
దులువ తనంబును వచ్చును
బలుకుబడిన కాన పొసఁగఁ బలుకఁగ వలయున్. 42

క. బెడిదముగఁ గత్తిఁ గొడ్డటఁ
బొడువఁ దెగిన మ్రానఁ జిగురువోడముఁ, బలుకులం
జెడఁ దునిసిన కార్యంబు ని
గుడ నేరదు పిదప నెట్లుఁ, గురువంశనిధీ ! 43

క. తనువున విఱిగిన యలుఁగుల
ననువునఁ బుచ్చంగ వచ్చు, నతినిష్ఠురతన్
మనమున నాటినమాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా ! 44

ఉ. అక్కట ! ధర్మనందనుని యాస్యము నందొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు, నీకొడుకు లొండొరు మీఱి నికృష్ట వాక్యముల్
పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచునుండఁగ నీవు దానికిన్
బ్రుక్కక వించునుండె దనురూపమె నీకిది కౌరవేశ్వరా ! 45

ఆ. చేటుకాలమైనఁ జెట్టమాటలు, నెఱి
గాని తెరువు పట్టు కర్జములును
దగినయట్ల తోఁచుఁ, దగియెడు నవి యవి
నీతులని మనంబు నిశ్చయించు. 46

వ. నీబుద్ధి పాండవులతోడి విరోధంబునెడ మరలంబడమి పాపం బింతియకాక యేమి సేయుదము. మనకులంబునం దేజోధైర్యధార్మికత్వాది గుణంబుల గరిష్ఠుండయిన యుధిష్ఠిరుండు నీ సిరికి వెలియై యట్లుండుట దగవగునే ? నీపెద్దతనంబు సూచి సైరణవాటించి యున్నవాఁడ'నిన విదురుచిక్కు మొగంబై ధృతరాష్ట్రుండు, 'నీ చెప్పిన నీతివాక్యంబుల నామనంబు దనివోవ దింకను జెప్పు'మనవుడు నతండు వెండియు నిట్లనియె. 47

ఆ. 'సకల పుణ్య కర్మచయమును నొకదెస,
వినుము పాడి దప్పకునికి యొక్క
దిక్కు, దీని శ్రుతులం దెలిపెడునెడఁ బాడి
కలిమి యెందుఁ బెద్దగా నుతించె. 48

గీ. పాడి గలిగిన నిహలోక ఫలములెల్లఁ
జేరుటయ కాదు కీర్తియుఁ జెందుఁ బురుషు,

ధరణిఁ బొగడిత యొందాఁక బొగడు నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు. 49

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుండును, నంగిరసుండను విప్రు కొడుకు సుధన్వుండును దమ తమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సలిపి వచ్చి తన్నడిగిన నితండు కొడుకు కితండు లాఁతియని తలంపక, మధ్యస్థుండై, సుధన్వు గెలిపించి యతనిచేత నిజ తనయుని జీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించెం గావున, నీవును ధర్మంబు విడువక యధర్మహేతులైన నీ కొడుకుల వలని పక్షపాతంబు విడిచి తెలంగు సేయుము; వారును నాపద లేక బ్రదుకుదురు. నీకును శోకంబు లేక తక్కునని చెప్పి మఱియును. 50

క. పాపంబులు గర్జములని
యేపునఁ జేయంగ నవియు నింపగు, ధర్మ
వ్యాపారంబు లకార్యము
లై పరిణతిఁ బొందవేని నట్టుల చెల్లున్. 51

చ. అది సభయే ప్రియంబెసఁగ నార్యులు నిల్వరయేని? నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సముంచిత ధర్మము వల్కరేని? న
ట్టిదియును ధర్మమే తగఘటించిన నిక్కము లేదయేనిఁ? దాఁ
బదిలపు నిక్కమే యొకనెపంబిడు చొప్పగునేని భూవరా! 52

ఉ. నీతిపథంబునన్ బ్రదుకనేర్చుట యుత్తమ భంగి, శౌర్యసం
జాతములై కరం బలరు సంపదలొందుట మధ్యవృత్తి, యు
స్ఫీతములైన భాగవహ జీవనముల్ దలఁపంగ నిష్టముల్,
నీతికి బాహ్యులైన ధరణీవర-మెత్తురె వారి నుత్తముల్. 53

ఆ. కయ్యమునకు నెపుడుఁ గాలు ద్రవ్వెదరు నీ
పుత్త్రులెల్ల నూతపుత్త్రుఁడాది
యగు తదీయ మంత్రు లంతకు ముందర
బిరుదు లీవు నీతి తెరువు సారవు. 54

క. పాండవులు శౌర్య మెల్లర,
ఖండిత నీతిప్రకార కార్యము మెచ్చె

యుండుదు, రెదురేచినఁ దుది
మండుదు. రార్వంగరాదు మఱియెవ్వరికిన్. 55

క. తమ తండ్రి భంగి నీకును
సముచితమగు భక్తి సేసి సజ్జనమత మా
ర్గమున నడచువారల నీ
విమలమతిం గన్న కొడుకు లట్లరయఁదగున్. 56

వ. అని పలికి మఱియు నిట్లనియె. 57

క. కారణము లేకయును నృప
కారపరత్వమున నొరుల కార్యంబులకున్
వారని యలజడిఁ బడియెడు
వారలచూ యేడుగడయు వారికి నధిపా! 58

చ. ఒకరుని చేతి ప్రోపును దదున్నతి ప్రాపునుగాంచి యెల్ల వెం
టను గొఱంతలేక పొగడందగు సంపదనొంది, యట్టిదా
తకుఁ దుదిఁ గీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడవే కురువంశవర్ధనా! 59

వ. కావునఁ, గృతము దలంపమి గీడు. పాండురాజు నీకుం బరమ భక్తుండు. పాండవులునుం దేజోలాభంబులు గావించినవారలు. వారల నాదరింపుమని చెప్పి వెండియు నిట్లనియె. 60

ఆ. బ్రదుకు, చేటు, పొగడువడుట, దూలొందుట,
యీగి, వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కింతయేల వగవ నధిప! 61

క. వగబలము దఱుఁగు, రూపఱు,
వగచిన మతిదప్పుఁ, దెవులు వచ్చును, దూఱున్
వగచి నలంగినఁ బ్రియమగుఁ,
బగతురకును, వగచుటుడుగు పార్థివముఖ్యా! 62

వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 63

క. రిత్తయుపచారముల నే
నుత్తముఁడగు ధర్మతనయు నుడికించితి, దు
ర్వృత్తులగు మత్సుతులకును
మిత్తియగుం బోర నగలు మిగులకయున్నె. 64

వ. 'నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపునట్టిది యెయ్యది దాని నెఱింగింపు'మనిన విదురుం
డిట్లనియె. 65

గీ. 'నియత తపమును, నింద్రియనిగ్రహంబు,
భూరివిద్యయు, శాంతికిఁ గారణములు'
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము లోభముడుగుట కౌరవేంద్ర! 66

వ. అని వెండియు. 67

క. జ్ఞాతుల పోషితమును, గో
వ్రాతము నాక్రమము, విప్రవర్గము చనవున్,
నాతుల కావించుటయును,
బ్రీతిం జన నిచ్చునతని పెంపొప్పు నృపా! 68

క. అలమికొని యొండొరుల ప్రో
పులఁ బ్రాపుల నెలమి కలిమిఁ బొంది బహు జ్ఞా
తులు నెమ్మిఁ గూడి తామర
కొలని క్రియన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 69

చ. కరితురగాది ఘట్టనయు, గాలియు నోంపఁగ నొంటినున్న య
త్తరువు, ననేక భూరుహవితానము గుంపయి పేర్చి బాధలం
బొరయునె, యన్నదమ్ములును బొందిన నేరికసాధ్యులట్లుగా
కరవయి నిల్చినం గలని కల్లిదమై పటివోదు రెంతయున్.' 70

౩

## శ్రీమదాంధ్ర భాగవతము - నవమస్కంధము

# రంతిదేవుని చరిత్రము



సీ. రాజవంశోత్తమ! రంతిదేవుని కీర్తి
యేల చెప్పఁగ విను మిందునందు,
నారాజు దన సంచితార్థంబు లన్నియు
నెడపక దీనుల కిచ్చియిచ్చి
సకుటుంబుఁడై, ధైర్య సంయుతుండయి, పేద
యై, కూడు నీరు లేకధమవృత్తి
నెంజేని నలువది యెనిమిది దివసముల్
దరియింప నొకనాఁ డుదయమునందు
నెయ్యి పాయసంబు నీరును గలిగిన
బహు కుటుంబ భార భయముతోడ
నలసి, నీరువట్టు నాఁకలియును జాల
యొదవఁజూచి కుడువ నుత్సహించె. 1

వ. అయ్యవసరంబున. 2

సీ. అతిథి భూసురుఁడొక్కఁ డాహారమడిగినఁ
గడపక ప్రియముతో గారవించి,
హరి సమర్పణమంచు నన్నంబులో సగ
మిచ్చిన భుజియించి యేగె నాతఁ,
డంతలో నొక శూద్రుఁ డశనార్థియై వచ్చి
పొడసూప, లేదనఁ బోక, తినకు
న్న యన్నములోని నొక భాగమిచ్చిన
సంతుష్టుఁడై వాఁడు సనిన వెనుక,
కుక్కగమియుఁ దాను నొక్కఁడే తేఱ, నా
యున్న శేషమిచ్చి యన్నయంబు

లాడి మ్రొక్కి పంప, నోడక చండాలుఁ
డొక్కఁ డరుగు దెంచి చక్క నిలిచి. 3

క. 'హీనుఁడఁ, జండాలుండను,
మానవకుల నాథ! దప్పి మాన దవులకుం
బోనేర, నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి రక్షింపఁగదే.' 4

వ. అనిన వాని దీనాలాపంబులకుఁ గరుణించి, రాజిట్లనియె. 5

ఉ. 'అన్నములేదు, కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న, రా
వన్న, శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తముఁ డొక్కఁడ సుమ్ము పుల్కసా!' 6

వ. అని పలికి,

మ. 'బలవంతంబగు నీరువట్టున నిజ ప్రాణాంతమై యున్నచో
నలయం డేమియు వీని హృజ్జ్వరము నాయాసంబు ఖేదంబు నా
జల దానంబున నేఁడు మాను'ననుచున్ సర్వేశ్వరాధీనుఁడై
జలముల్ వోసెను రంతిదేవుఁడు దయం జండాల పాత్రంబునన్. 8

వ. తదనంతరంబ బ్రహ్మాది దేవతలు సంతోషించి రంతిదేవునకు మేలు సేయం దలంచి నిజాకారంబులతో ముందట నిలువంబడిన నా నరేంద్రుఁ డందఱకు నమస్కరించి, 9

క. వారల నేమియు నడుగక
నారాయణ భక్తి తన మనంబున వెలుఁగన్
ధీరుం డాతఁడు మాయా
పారజ్ఞుం డగుచుఁ బరమ పదమును బొందెన్. 10

---

౪

శ్రీమదాంధ్ర భాగవతము

దశమస్కంధము - పూర్వ భాగము

# శ్రీ కృష్ణావతార ఘట్టము

---

క. పంకజముఖి నీలాలక
సంకటపడ ఖలుల మానసంబుల నెల్లన్
సంకటము దోఁచె, మెల్లన
సంకటముల లేమి దోఁచె సత్పురుషులకున్. 1

సీ. స్వచ్ఛంబులై పొంగె జలరాసు లేడును,
గల ఘోషణముల మేఘంబు లుఱిమె,
గ్రహతారకలతోడ గగనంబు రాజిల్లె,
దిక్కులు మిక్కిలి తెలివిఁ దాల్చెఁ,
గమ్మని చల్లని గాలి మెల్లన వీచె,
హోమానలంబు సెన్నొంది వెలిఁగెఁ,
గొలఁకులు కమలాళి కులములై సిరినొప్పెఁ,
బ్రవిమల తోయలై పాఱె నదులు,
పాపుర గ్రామ ఘోషములైయొప్పె వసుధయొప్పె,
విహగరవ పుష్ప ఫలముల వెలసె వనము,
లలరుసోనలు గురిసి రయ్యమరవరులు,
దేవదేవుని దేవకీదేవి గనఁగ. 2

క. పాడిరి గంధర్వోత్తము,
లాడిరి రంభాది కాంత లానందమునన్,
గూడిరి సిద్ధులు, నుతిఁగొని
యాడిరి చారణులు, మొరసె నమరుల భేరుల్. 3

వ. అయ్యవసరంబున, 4

క. సుతుఁగనె దేవకి నడురే
యతి శుభగతిఁదారలును గ్రహంబులు మండన్,
దితి సుత నిరాకరిష్ణున్,
శ్రితహృదయాలంకరిష్ణు, జిష్ణున్, విష్ణున్.

క. వెన్నుని, నతిప్రసన్నునిఁ,
గ్రన్ననఁగని మెఱుఁగుఁబోఁడి గడు నొప్పారెం
బున్నమ నాఁడు కళానిధిఁ
గన్న మహేంద్రాశ చెలువుగలిగి నరేంద్రా! 6

వ. అప్పుడు. 7

సీ. జలధరదేహు, నాజాను చతుర్బాహు,
సరసీరుహాక్షు, విశాలవక్షుఁ,
జారుగదా శంఖ చక్రపద్మ విలాసుఁ,
గంఠ కౌస్తుభ మణి కాంతిభాసుఁ,
గమనీయ కటిసూత్ర కంకణ కేయూరు,
శ్రీవత్స లాంఛనాంచిత విహారు,
నురుకుండల ప్రభాయుత కుంతల లలాటు,
వైడూర్య మణిగణ వర కిరీటు,
బాలుఁ, బూర్ణేందు రుచిజాలు, భక్తలోక
పాలు, సుగుణాలవాలుఁ, గృపావిశాలుఁ,
జూచి తిలకించి పులకించి చోద్యమంది
యుబ్బి చెలరేఁగి వసుదేవుఁడుత్సహించె. 8

క. స్నానము సేయఁగ రామిని
నానందరసాబ్ధి మగ్నుఁడై, విప్రులకున్
ధేనువులం బది వేలను
మానసమున దారపోసి మఱి యిచ్చుటకున్. 9

వ. మఱియు వసుదేవుండు. 10

క. ఈ పురిటి యింటి కుడ్య
దీపంబును బోలెఁ జాల దీపించె, నిజం

ఈపాపఁడు నలుమొగముల
యాపాపనిఁ గనినమేటి యగు'నని భక్తిన్. 11

ఆ. చాఁగి మ్రొక్కి లేచి, సాగున నొసలిపైఁ
గేలుదమ్మిదోయిఁ గీలుకొలిపి,
పాపఁడనక వెఱక పాపనిమొదలింటి
పోకలెల్లఁ దలఁచి పొగడఁదొడఁగె. 12

క. "ఏ నిన్ను నఖిల దర్శను,
జ్ఞానానంద స్వరూపు, సంతతు, నపరా
ధీనుని, మాయాదూరుని,
నూనునిఁగాఁగంటి నిట్టి చోద్యము గలదే. 13

క. అచ్చుగ నీ మాయను మును
చెచ్చెరఁ ద్రిగుణాత్మకముగఁ జేసిన జగముం
జొచ్చియుఁ జొరనట్లుందువు,
చొచ్చుటయును లేదు, లేదు చొరకుండుటయున్. 14

క. సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ వాత్మవస్తు సంపన్నుఁడవై
సర్వమయుఁడ వగునీకును
సర్వేశ్వర లేవు లోను సంధులు వెలియున్. 15

ఆ. ఆత్మవలనఁగలిగి యమరుదేహాదుల,
నాత్మకంటెఁ వేఱులవి యటంచుఁ
దలఁచువాఁడు మూఢతముఁడు, గావున నీశ
విశ్వమెల్ల నీవు వేఱు లేదు. 16

వ. ఇదియునుంగాక 17

ఆ. నీవు రక్త ధవళ నీల వర్ణంబుల
జగము సేయఁ గావ సమయఁజూడఁ
దనరు, దట్లు నేఁడు దైత్యుల దండింపఁ
బృథివిఁగావ నవతరించి తీశ! 18

శా. మింటన్ మ్రోసిన మ్రోఁత దాలిమిని లో మేఁ గ్రీడింప మున్ నీవు నా
యింటం బుట్టెదవంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీయన్నలన్,
గంటం గూరుసుఁదేఁడు నీయుదయ మాకారాజనుల్ సెప్పఁగాఁ
బంటింపం డెదురేగుదెంచు వడి నీపై నేఁడు సన్నద్ధుఁడై.' 19

## శ్రీకాళహస్తి మాహాత్మ్యము - తృతీయాశ్వాసము

# దుర్భిక్షవర్ణనము

---

క. ఆభూవిభుఁ డిబ్భంగిని
భూభాగం బేలునపుడు పుట్టెన్ గ్రహావ
క్రాభద్ర క్షామ మహా
క్షోభంబు జగంబు వర్ష శూన్యము గాఁగన్. 1

సీ. చనుదెంచె శని మీనమునకుఁ, దూర్పున ధూమ
కేతువు దోఁచె, జీమూతడంబ
రం బేచె మధ్యందినంబుల, రేపాడి
చినికెఁ దుషారంబు దినదినంబు,
రాత్రుల మిన్ను నిర్మల భావమును బొందె,
వెలియెండ గాసె, గర్వాలి దొరంగె,
వర్షగర్భము నడవక పోయె, విదియలఁ
గుముదాప్త ధారణ కొమ్ము దతిఁగె,
కన్య భిన్నింపదయ్యె, మఖాప్రవేశ
కాలమునయందు నుఱుమ, దశాంశగర్జ
లెసఁగె జముదెసఁ దొలకరి, నేమి సెప్ప
నెల్ల జనముల మనములు దల్లడిల్ల. 2

వ. మఱియును. 3

గీ. గనుసు, లూదర్లు, బరపటల్, గోళ్లగొండు,
లల్లి బియ్యంబు, వెదురు బియ్యంబు, గొట్టె
చెట్లు, నింజెట్లు, తుంగ ముస్తియలు, నీత
గుంజు మొదలుగఁ దినవొరకొనియె జనము. 4

క. అఱవడు, గంటె, తవిఁడియ
లఱువది దినములఁ బండునవి బ్రదుకాసన్
దఱచుగ నేతా లెత్తఁగఁ
బఱిపఱియై యవియు నల్లపడి చెడిపోయెన్. 5

ఉ. తోలును నెమ్ములు న్మిగిలి ప్రోసిఁ గదొంబది చోట్లఁ గిరాతవా,
రాలిని బిడ్డల న్విడిచి యాఁకటిచిచ్చున నెచ్చుపోవువా,
రేలిక బంటువాసి యొక యించుక లేక కృశించువారు, నై
తూలెడునంబు మీన శని దాసుయు దాఁకి నిరస్త సస్యమై. 6

క. నవమును నుండియు నొక్కొక
దినసంఖ్యను నశన మబ్బఁదిని దగమిగులన్
భువి నొరిగి లేవ నోపక
శివశివ! జనకోటి విడుచు జీవానిలముల్. 7

క. కిలవంతింతని నొత్తఁగఁ,
గిరి వెదుక దినంగ నోపఁగలుగక మనుజుల్
సుసును బ్రసుక్కిరి, కొందఱు
పరదేశంబులనుఁగనిరి బ్రదుకుల కొఱకున్. 8

క. మునిసి మునిసిఁ దినుకలు
నైనం దరియింపలేక, యాపురిమూల
స్థాన హరిద్విజుఁ డొకఁడెం
పేనియుఁ బోదలఁచి నస్మహేశుఁడు కరుణన్. 9

---

*

## ౬

## కుమార సంభవము - తృతీయాశ్వాసము

# పార్వతి పరమశివుని శుశ్రూషించుట



ఉ. అంతికమున్న సన్మతిఁ బురాంతకు రాకయు, వచ్చియున్న వృ
త్తాంతము, మేలుగా నెఱిఁగి యా హిమవంతుఁ డనంత సంభ్రమా
త్యంత మనోనురాగమున సప్రమద వాజి వరూథ దంతిసా
మంత విలాసినీ స్వజన మంత్రి పురోహిత భృత్యయుక్తుఁడై. 1

వ. నిజాశేషకుల కళత్ర పుత్త్రీ సమేతుండై చనుదెంచి పరమేశ్వరునిం గని, మహార్మ
హార్మహితాలంకృత సర్వాంగుండై నిజదేహాది సమస్త రాజ్య విభవంబులు
నీశ్వర శ్రీపాదంబులక నివేదించి, 2

క. వినుతించుచున్న గిరిపతిఁ
గని గిరిశుఁడు, సమ్మదమునఁ గారుణ్యా లో
కన వార్ధి సుధారస వా
రి నిమగ్నునిఁ జేసి సురవరేణ్యునిఁ జేసెన్. 3

వ. ఇట్లచలాధీశ్వరుం డీశ్వరు కరుణామృతరస ప్రవాహప్లావితుం డగుచు నీశ్వరా
రాధ నానంద సంతోషితాంతరంగుఁడగుచు నుండునంతఁ గొంతకాలంబునకు
రుద్రుండు గిరీంద్రున కనేక వరంబు లొసంగి నిజపురంబున కరుగుమని
నియోగించిన. 4

క. విని కాని యెన్నఁడును, నినుఁ
గని యెఱుఁగరు హరి సరోజగర్భాసుర స
న్మును, లిట్టి నీ స్వరూపముఁ
గని యియ్యెడఁ బాసి పోవఁగా నోపుదునే. 5

వ. అని కరంబులు మొగిచి దీనాననుండై యున్నవాని భక్తియుక్తిం గరుణించి, సకల
లోకాభీష్ట ఫలవృద్ధి కేదారాత్మకుండ నగుటం గేదారేశ్వరుం డన నిప్పురంబున
వసియించెద నోడకుండుమనిన వానికిఁ బ్రసాదంబని. 6

సీ. 'ఈబాల దన్నుఁ దానెఱిఁగిన కోలెన
నన్య శరణ్యయై యహరహంబు
నిన్న కొల్చుచునుండు, నీవిందు మాపుణ్య
మునఁజేసి వచ్చుట విని ముదమునఁ
జూడంగ వచ్చె, నిన్ జూచిన కోలె భ
క్త్యావేశమునఁ జేసి జీవమొదలఁ
బాసిన మీపొందు వాయనోపదు, పాసి
తలరుఁ గావున నిచ్చఁ దగిన పరువుఁ
బనులు సేయుచుండుఁ, బార్వతి యునికికి
వరద ! యిచ్చగింప వలయు' ననిన
నతని విన్నపమున నంతయు భక్తవ
త్సలుఁడు నెమ్మనమున సంతసించి. 7

వ. అదత్త ప్రతి వచనుండైన దానికి మహా ప్రసాదమని యనేక మాణిక్యా కల్ప
లేపాంబరాలంకృతంబైన కన్యాంతఃపురంబులోన. 8

క. ఆక్షితిధరపతిఁ, 'శివుఁ బ్ర
త్యక్షముగాఁ గొలుచుచుండుమ'ని తత్పరుఁడై
శిక్షించి గౌరి నంద సు
రక్షితముగ నునిచి నిజపురంబున కరిగెన్. 9

వ. అంతం బార్వతియు నీశ్వరారాధనాసక్త యుక్తయై భక్తియు ననురక్తియు
నంతకంత కగ్గలించుచుండ. 10

సీ. చమరీజ బర్హ మార్జనులఁ బరీక్షించి
నయమున సమ్మార్జనంబు సేయుఁ,
గర్పూర శైలాద్రి కస్తూరికా కర్ద
మంబుల నను లేపనంబు సేయుఁ,
గాశ్మీర మాంజిష్ఠ గరుడాండ హరినీల
ముక్తాఫలంబుల ముగ్గువెట్టుఁ,
గుసుమ పల్లవలతా కోరకంబులఁ జిత్ర
దామంబు లొనరించుఁ, దావి మిగులఁ.

బుష్పమందిర మొసరించుఁ, బుణ్యవారి
సౌరభము లించి మణి కలశముల నించు,
నచలపతిసుత మదినిట్టులహారహంబు
శివున కనురక్తిఁ బరిచర్య సేయుచుండె. 11

చ. పొలుపుగఁ జంద్రశేఖరు తపోవన మంగజ చక్రవర్తి దో
ర్బలమున ముట్టి చూఁడఁ గొనఁ బంచిన దండొకొ నాఁగఁ బొల్చు క
న్యలు దనుఁగొల్చి రా నచల నందన సుందర లీల నిచ్చలుం
గొలుచుచునుండె భక్తి నహిమాంశుకలామండితు గంపె మండలుఁ 12

సీ. మొసలావులించి వాసన సల్లఁ బసిగొని
తేఁ దేఁటి గము లేఁగు లింపకుండ,
నెదనూఱు గొనవేచి సుడియు తెమ్మెరలచేఁ
బొడిము పుప్పొడి పొలివోవకుండఁ,
దరణి కూటమున మేయొరలి పద్మిని పేన
మొలతెంచు మధుమద మొలుక కుండ,
మేల్కని గోమిని మెలఁగి మైమఱసినఁ
బొది గొన్నయకరువు సెదరకుండఁ,
దెలిసి ఒక్కవ లొండొంటిఁగలయఁ దారు
కలకలంబున రేకులు గదల కుండ
మున్న కొని వచ్చి గణికా సమూహితోద
గిరిజ పూజించెఁ బసిఁడి తామరల వరద. 13

## ౨
## నీతిపద్యములు

గీ. సంపదలు గల్గుతఱి మహాజనుల హృదయ
మభినవోత్పల కోమలంబగుచు వెలయు,
నాపదలు వొందునపుడు మహాపుసింధ
రాశ్మ సంఘాత కర్కశంబై తనర్చు. 1

ఉ. మానవుఁడాత్మ కిష్టమగు మంచి ప్రయోజన మాచరించుచోఁ
గానక యల్పుఁడొక్కఁడది గాదని పల్కిన వాని పల్కుకై
మానఁగఁజూడఁడాపని, సమంచిత భోజన వేళనీఁగ కా
లూనిన వంటకంబు దినకుండఁగ నేర్పగు నోటు భాస్కరా ! 9

చ. సరసదయా గుణంబు గల జాణమహింగడునొచ్చి యుండియుం
దఱుఁగుగ వానికాసపడి డాయఁగ వత్తురు లోకులె, ట్లనం
జెఱకు రసంబు గానఁగను జిప్పిలి పోయిన మీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁజేరవె ముదంబునఁ జీమలు పెక్కు భాస్కరా ! 10

భాస్కర శతకము

# మిత్రలాభము



## పీఠిక

గంగాతీరమందు సకల సంపదలు గలిగి పాటలీపుత్రమను పట్టణము గలదు. ఆ పట్టణము సుదర్శనుఁడను రాజు పాలించుచుండును. అతఁ డొకనాఁడు వినోదార్థము విద్వాంసులతో సల్లాపములు జరుపుచుండఁగా నొక బ్రాహ్మణుఁడు,

క. పరువంబు కలిమి దొరతన
మరయమి యనునట్టి వీని యందొకఁ డొకఁడే
పొరయించు ననర్థము నాఁ
బరఁగినచో నాల్గుఁ జెప్పవలయునె చెప్పుమా.

క. పలు సందియములఁ దొలఁచుచు,
వెలయించు నగోచరార్థ విజ్ఞానము, లో
పల కక్షి శాస్త్రము, య్యది
యిలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్.'

అని ప్రస్తావవశముగాఁ జదివెను. ఆ పద్యములు రాజు విని చదువులేక మూర్ఖులయి సదా క్రీడాపరాయణులయి తిరుగుచున్న తన కొడుకులను దలఁచుకొని యిట్లని చింతించె. 'తల్లిదండ్రులు చెప్పినట్టు విని చదువుకొని లోకులచేత మంచివాఁడనిపించుకొన్నవాఁడు బిడ్డఁడు గాని, తక్కినవాఁడు బిడ్డఁడా? మూర్ఖుఁడు కలకాలము తల్లిదండ్రులకు దుఃఖము పుట్టించుచున్నాఁడు. అట్టి వాఁడు చచ్చెనా తల్లిదండ్రులకు దుఃఖము నాఁటితోనే తీఱుచున్నది. కులమునకు యశము తెచ్చిన వాఁడు పుత్త్రుఁడు గాని, తల్లికడుపు చెఱుపఁబుట్టినవాఁడు పుత్త్రుఁడు

గాఁడు. గుణవంతులలోఁ బ్రథమగణ్యుఁడు గాని కొడుకును గన్న తల్లి కంటె వేఱు గొడ్రాలు గలదా? గుణవంతుఁడయిన పుత్త్రుఁ డొకఁడు చాలును. మూర్ఖులు నూఱుగురవలన ఫలమేమి? ఒక రత్నముతో గులకరాలు గంపెఁడయినను సరిగావు. విద్యావంతులయి గుణవంతులయిన పుత్త్రులను జూచి సంతోషించుటయును సంపద మహాపుణ్యులకుఁగాని, యెల్లవారికి లభింపదు.' అని కొంత చింతించి, యూహించి, తలపంకించి, 'యూరక యీ చింతయేల? నా పుత్త్రులు చదువమనిరా? పరామరిక మాలి తగిన విద్యాభ్యాసము చేయింపనయితిని. బిడ్డలకు విద్యాభ్యాసము చేయింపమి తల్లిదండ్రుల దోషము. తల్లిదండ్రులచేత శిక్షితుఁడయి బాలుఁడు విద్వాంసుఁడగును గాని, పుట్టఁగానే విద్వాంసుఁడు కాఁడు. పురుషకారముచేతఁ గార్యములు సిద్ధించును. రిత్తకోరికలచేత సిద్ధింపవు. నిద్రించు సింహమునోటను మృగములు తమంత వచ్చి చొరవు కాఁబట్టి యిప్పుడు నా పుత్త్రులకు విద్యాభ్యాసమునకయి వలయు ప్రయత్నము చేసెద' నని చింతించి యచ్చటి విద్వాంసులతో నిట్లనియె. 'నా పుత్త్రులు విద్యాభ్యాసము లేక క్రీడాసక్తులయి తిరుగుచున్నవారు. ఎవ్వరయినను వీరిని నీతిశాస్త్రము చదివించి మంచి మార్గమునకుఁ ద్రిప్పఁజాలినవారు కలరా?' అనిన విష్ణుశర్మ యను బ్రాహ్మణుఁ డిట్లనియె. 'రాజోత్తమా! ఇది యెంతపాటి పని. మహావంశజాతులయిన దేవర పుత్త్రులను నీతివేదులను జేయుట దుష్కరముగాదు. కొంగను మాటలాడించుట దుష్కరముగాని, చిలుకను బలికించుట దుష్కరముగాదు. సద్వంశమందు గుణహీనుఁడు పుట్టఁడు. పద్మరాగముల గనిలో గాజు పుట్టునా? ఎట్టి రత్నమయినను సానపెట్టక ప్రకాశింపనట్టు బాలుఁడెట్టివాఁడయిన గురుజనశిక్ష లేక ప్రకాశింపఁడు. కాఁబట్టి నే నాఱుమాసములలో దేవర పుత్త్రులను నీతికోవిదులను జేసి మీకు సమర్పించెదను.' అనిన రాజు

సంతోషించి యిట్లనియె. 'పూవులతోఁ గూడిన నారకు వాసన గలిగి నట్లు సజ్జనులతో సావాసించు మూర్ఖునకు మంచి గుణము గలుగుట సాజము. అంతేకాదు. సాధుసాంగత్యము సర్వశ్రేయములకు మూలము.' అని సాదరముగా వచియించి, యాతనికిఁ బసదనమిచ్చి, తన కొమరులను రప్పించి, చూపి, 'విద్యాగంధము లేక జనుసాంధుల వలె నున్నారు. వీరిని గన్నుదెఱపి రక్షించుట మీ భార'మని చెప్పి యొప్పగించెను. అనంతర మా బ్రాహ్మణుఁడు వారల నొక రమణీయ సౌధమునకుఁ దోడుకొనిపోయి కూర్చుండఁబెట్టుకొని యిట్లనియె. 'మీకు వినోదార్థమొక కథ చెప్పెద. అది మిత్రలాభము, మిత్ర భేదము, విగ్రహము, సంధియునని నాలుగంశములచేత నొప్పుచుం డును. వినుండు.

## మిత్రలాభము

ధనసాధన సంపత్తి లేనివారయ్యు బుద్ధిమంతులు పరస్పరమైత్రి సంపాదించికొని కాక కూర్మ మృగ మూషికముల వలె స్వకార్యములు సాధించుకొందురు.' అనిన రాజపుత్త్రులు విని, 'యేకార్యములు కాక కూర్మ మృగ మూషికములు సాధించెను? మాకు సవిస్తరముగా విని పింపుఁ' డనిన విష్ణుశర్మ యిట్లని చెప్పఁదొడంగె.

'గోదావరీ తీరమందు గొప్ప బూరుగువృక్షము గలదు. అందు నానాదిక్కులనుండి వచ్చి పక్షులు రాత్రి వసించుచుండును. ఒకనాఁడు వేకువ లఘుపతనకమను వాయసము మేలుకొని రెండవ యమునివలె సంచరించుచున్న కిరాతునిఁ జూచి, 'వఱువాత లేచి వీని మొగము చూచితిని. నేఁడేమి కీడు రాఁగలదో తెలియదు. వీఁడు వచ్చినచోట నిలువఁదగదు. జాగుసేయక యీచోటు విడిచి పోవలె'నని యత్నము చేయుచుండఁగా వాఁడా వృక్షమునకు సమీపమందు నూకలు చల్లి,

వల పన్నిపోయి, చేరువపొదలో దాఁగి, పొంచి చూచుచుండెను. అనంతరము చిత్రగ్రీవుఁడను కపోతరాజు నింగిని సంచరించుచు నేల మీఁది నూకలు చూచి తనతోడి కపోతములతో నిట్లనియె. ‘ ఈ నిర్జనవనమందు నూకలు రా నిమిత్తమేమి ? మన మీనూకల కాశపడ రాదు. తొల్లి యొక తెరువరి కంకణమున కాశపడి పులిచేతఁ జిగులు కొని మృతిఁ బొందెను. మీకాకథ చెప్పెద వినుండి.

ఒక ముసలిపులి స్నానముచేసి దర్భలు చేతఁబట్టుకొని కొలని గట్టుననుండి, ‘ యోయి తెరువరీ ’ యీ పసిఁడి కంకణము వచ్చి పుచ్చుకొమ్మ’ని పిలిచి చెప్పెను. ఒక పాంథుఁ డామాట విని, ‘ యిది నా భాగ్యముచేతనే వచ్చుచున్నది. ఏల సందేహపడవలె ’నని చింతించి, ‘ యేదీ కంకణము చూపు’మని యడిగెను. పులి చేయిచాఁచి, ‘ యిదిగో ! హేమకంకణము చూడుమ’ని చూపెను. ‘ నీవు క్రూర జంతువవు. కాఁబట్టి, యేలాగున నిన్ను నమ్మవచ్చు’నని పాంథుఁడు పలి కెను. ఆమాట విని పులి యిట్లనియె : ‘ ఓరీ పాంథ ! విను. మునుపు యీవనమందు మిక్కిలి దుష్టుఁడనయి యుంటిని. అనేకములను గోవు లను మనుష్యులను వధించి, మితిలేని పాపము సంపాదించి, భార్యా పుత్త్రులను బోఁగొట్టుకొని యేకాకినయి నిలిచితిని. అనంతర మొక పుణ్యాత్ముఁడు నాయందు దయచేసి, ‘ యిఁకమీఁదటగోవులను, మను ష్యులను వధింపకు. సత్కార్యములు చేయుమ’ని చెప్పెను. అది మొద లుకొని పాపకృత్యములు విడిచి మంచికార్యములు చేయుచున్న వాఁడను. వృద్ధుఁడను. బోసినోరివాఁడను. గోళ్లుపోయినవి. లేవసత్తువ లేదు. నన్ను నీవేల నమ్మవు ? నీవు దరిద్రుఁడవు. కాఁబట్టి, యిది నీకు దానము సేయవలెనని కోరితిని. సంశయపడక యీ కొలనిలో స్నానముచేసి వచ్చి పసిఁడి కంకణము పుచ్చుకొమ్ము.’ అనఁగానే వాఁడు పేరాసచేత దాని మాటలకు లోఁబడి కొలనిలో స్నానము

చేయఁబోయి మొలబంటి బురదలో దిగఁబడెను. అప్పుడు పులిచూచి, 'యయ్యయ్యో! పెనుఁరొంపిలో దిగఁబడితివిగదా! నేను వచ్చి నిన్ను లేవనెత్తెదను. భయపడకుమ'ని తిన్నతిన్నఁగా సమీపించి వానిని బట్టుకొనెను. ఈలాగున వాఁడు తగులుకొని, 'క్రూర జంతువును నమ్మ రాదు. నమ్మి యీగతి తెచ్చుకొంటిని. మించినదానికి వగచి యేమి ప్రయోజనము? ఎవ్వరికైన విధి తప్పించుకో వశముగాదు.' అని చింతించుచు దానిచేత భక్షింపఁబడియె.

'కాఁబట్టి సర్వవిధముల విచారింపని పని చేయరాదు. చక్కఁగా విచారించి చేసిన పనికి హాని యెప్పటికి రాదు.' అని చెప్పఁగా విని యొక కపోతవృద్ధము నవ్వి యిట్లనియె. 'ఆఁ! యివి యేటిమాటలు? ఒక యిక్కట్టు వచ్చినప్పుడు వృద్ధునిమాట విననలసినది, వినుండు. స్థానాస్థానములు వివేకింపక సర్వత్ర యిట్టి విచారము పెట్టుకోరాదు. కొఱమాలినశంకలు తెచ్చుకొని భోజనము మానుకోవచ్చునా? మానుకొని యేలాగున బ్రతుకవచ్చును? ఈర్ష్యాళువు, జుగుప్సావంతుఁడు, నిస్సంతోషి, క్రోధనుఁడు, నిత్యశంకితుఁడు, పరభాగ్యోపజీవియు నను వారాఱుగురు దుఃఖభాగులని నీతికోవిదులు చెప్పుదురు.' అనఁగా విని కపోతములన్ని నేల వ్రాలెను.

గొప్ప శాస్త్రములు చదివి, మిక్కిలి వినికి గలిగి, పరుల సంశయములను వారింప నేర్పుగలవారు సయితము లోభమువల్ల వివేకము పోఁగొట్టుకొని క్లేశపడియెదరు. ఆహా! లోభమెంత చెడుగుణము! అన్ని యిడుమలకు లోభమే కారణము.

అనంతరము పావురములన్ని వలలోఁ దగులుకొని కపోతవృద్ధమును జూచి, 'నీవు వృద్ధుఁడవు. తెలిసిన వాఁడవని భ్రాంతిపడి నీ మాటలను విని యీ విపత్తు తెచ్చుకొంటిమి. ఎవ్వఁడు బుద్ధిమంతుఁడో

వాఁడు వృద్ధుఁడు గాని యేండ్లు మీఱినవాఁడా వృద్ధుఁడు?' అని కపోతములు నిందింపఁగా విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'ఇది యీతని దోషముగాదు. ఆపదలు రాఁగలప్పుడు మంచియుఁ జెడుగగుచున్నది. మనకాలము మంచిదికాదు. ఊరక యేల యీతని నిందించెదరు? ఈతఁడు తనకు దోఁచినది చెప్పినాఁడు. అప్పుడు మనబుద్ధి యేమయ్యె? ఆపద వచ్చినప్పుడు తప్పించుకొను సాధనము విచారింపవలెఁ గాని యీమాటలవల్ల ఫలమేమి? విపత్కాలమందు విస్మయము కాపురుష లక్షణము. కాఁబట్టి యిప్పుడు ధైర్యము తెచ్చుకొని ప్రతీకారము చింతింపుఁడు. ఇప్పటికి నాకొకటి తోఁచుచున్నది. మీరందఱు పరాకులేక వినుండు. ఒక్కసారిగా మన మందఱము వల యెత్తుకొని యెగిరి పోవుదము. మన మల్పులము. మన కీకార్యము సాధ్యమవునా యని విచారింపఁ బనిలేదు. సంఘీభవించి యెంతటి కార్యమయిన సాధింపవచ్చును. గడ్డిపరకలు సయితము వొంటిగా నేర్పడి మదపుటేనుఁగును బంధించుచున్నవి. మీరు విచారింపుఁడు. దీనికంటె మంచి సాధనము మీబుద్ధికిఁ దగిలెనా యది చేయుదము' అనిన విని, 'మీరు చెప్పినదే సరి; యింతకంటె మంచిసాధనము లే'దని చెప్పి పావురములన్ని విచిత్రముగా గగనమార్గమున కెగిరెను. అప్పుడా వ్యాధుఁడు వెఱఁగుపడి, 'యీపక్షులు గుంపుగూడి వల యెత్తుకొని పోవుచున్నవి. నేల వ్రాలఁగానే పోయి పట్టుకొనియెదఁ గాక' యని చింతించి మొగము మీఁదికెత్తుకొని ఱెప్పవేయక చూచుచు నవి పోవు దిక్కునకయి క్రిందనే పోవుచుండెను. ఈ వింత చూడవలెనని లఘుపతనకము పావురములను వెంబడించి పోవుచుండెను. అనంతర మాపక్షులు చూపుమేరదూరము మీఱిపోఁగానే వ్యాధుఁడు నిరాశచేసికొని మరలి పోయెను. అదిచూచి, 'యిప్పుడు మనము చేయవలసినది యేమి' యని పక్షులడిగెను. చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'లోకమందు మాతాపితలు

మిత్రుఁడను వీరు మువ్వురే హితులు. తక్కినవారందఱు ప్రయోజనముఁబట్టి హితులగుచున్నారు. కాఁబట్టి యిప్పుడు నాకు మిత్రుఁడొకఁడున్నాఁడు. అతఁడు హిరణ్యకుఁడను మూషికరాజు. గండకీతీరమందు విచిత్రవన మాతని వాసస్థానము. అతఁడు పండ్లబలిమిచేత వలత్రాళ్లు తెగఁగొఱికి మన యాపదఁ బాపఁగలఁడు. అక్కడికి మనము పోవుదము.' అని చెప్పఁగానే పావురములన్నియుఁ జిత్రగ్రీవుఁడు చెప్పిన గుఱుతు పట్టుకొనిపోయి హిరణ్యకుని కలుఁగుదాపున వ్రాలెను. అప్పుడు హిరణ్యకుఁడు కపోతములు వ్రాలిన సద్దువిని భయపడి, కలుఁగులో మెదలకుండెను. అనంతరము చిత్రగ్రీవుఁడు కలుఁగుదాపుచేరి యెలుగెత్తి యిట్లనియె. 'ఓ చెలికాఁడా! యేల మాతో మాటలాడవు?' అనఁగానే హిరణ్యకుఁ డా మాట సవ్వడివట్టి శీఘ్రముగా లాఁగ వెలుపలికి వచ్చి యిట్లనియె.

'ఆహా! యేమి నా భాగ్యము! నా ప్రియమిత్రుఁడు చిత్రగ్రీవుఁడు నాకు నేత్రోత్సవము చేయుచున్నాఁడు!' అని పలుకుచు వలలోఁ దగులుకొన్న పావురములను జూచి వెఱఁగుపడి క్షణమూరకుండి, 'చెలికాఁడా! యిది యేమని యడిగెను. చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'చెలికాఁడా! యిది మా పూర్వజన్మ కర్మమునకు ఫలము. చేసినకర్మమనుభవింపక తీఱునా?' అనఁగానే హిరణ్యకుఁడు చిత్రగ్రీవుని బంధము ఛేదించుటకయి సమీపింపఁగాఁ జిత్రగ్రీవుఁ డిట్లనియె: 'చెలికాఁడా! చేయవలసినది యీలాగునఁగాదు. ముందుగా నాయాశ్రితుల బంధము వదలింపుము. తరువాత నాకుఁ గానిమ్ము.' అనిన హిరణ్యకుఁడు విని యిట్లనియె. 'నాదంతములు మిక్కిలి కోమలములు. అన్నిటి బంధములు కఱచి త్రెంపఁజాలను. పండ్లబలిమి కలిగినంతదాఁక నీబంధము ఛేదించెదను. తరువాత శక్తి గలిగిన పక్షమునకు మిగిలిన వారి కార్యము చూచుకొందము.' అనిన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'ఆ

లాగుననే కానిమ్ము. శక్తికి మీఱి యేమి చేయవచ్చును ? ముందు యథాశక్తి మీరి నిర్బంధము మానుఁడు. ఆవల నా పని యప్పటి కయిన యట్లు విచారించుకొందము.' అనిన హిరణ్యకుఁ డిట్లనియె. 'తన్ను మాని పరుల రక్షింపవలెననుట నీతికాదు. 'తన్ను మాలిన ధర్మము మొదలు చెడ్డబేరముఁ గలదా !' యను లోకోక్తి విన్నాఁడవు గావా ? తాను బ్రతికికదా సమస్త పురుషార్థములు సంపాదించుకోవలె ? తాను బోయిన తర్వాత దేనితోనయినఁ బనియేమి ?" అన విని చిత్రగ్రీవుఁ డిట్లనియె. 'చెలికాఁడా ! నీవు చెప్పినది నీతికాద నను. అయినను నావారి దుఃఖముచూచి సహింపఁజాలను. కాఁబట్టి యింత నొక్కి చెప్పితిని. ప్రాజ్ఞుండు తన జీవితమునయిన మానుకొని మంచివారికి వచ్చిన కీడు తొలఁగింపవలెనని నీతి కోవిదులు చెప్పుదురు. అది యటుండనిమ్ము. నా వంటివారు వీరు. వీరివంటి వాఁడను నేను. ఇప్పటికొదవని నా ప్రభుత్వమువలన వీరికి రాఁగల ఫలమేమి ? చెలికాఁడా ! హేయమై వినశ్వరమైన యీ కళేబరమం దాస్థ మాని, నాకు యశము సంపాదింపుము. నావలన జీతమా బత్తెమా, యేదియు లేదు. అయినను వీరు సర్వకాలము నన్ను విడువక కొలుచుచున్నారు. నేను వీరి ఋణమెప్పుడు తీర్చుకోఁగలనో యెఱుఁగను. నాబ్రదుకు ముఖ్యముగాఁ జూడకుము. వీరి ప్రాణములు రక్షించితేఁ జాలును. అనిత్యమై, మలినమైన కాయముచేత నిత్యమై, నిర్మలమైన యశము లభించెనా దానికంటె లాభము గలదా ? శరీరమునకు గుణములకు మిక్కిలి యంతరము. శరీరము క్షణభంగురము. గుణములు కల్పాంతస్థాయులు. ఇట్టి శరీరము నపేక్షించి కీర్తి పోఁగొట్టుకొనవచ్చునా ?' అనిన విని హిరణ్యకుఁడు సంతోషపడి పులకితుఁడై యిట్లనియె. 'చెలికాఁడా ! మేలు మేలు. నీయాశ్రిత వాత్సల్యము కొనియాడ నే నేపాటివాఁడను ? ఈ గుణముచేఁ ద్రిలోకాధిపత్యమునకుఁ దగియున్నవాఁడవు.' అని

పలికి, యన్నింటి బంధములు తెగఁగొఱికి, వానినన్నిటిని సాదరముగా సంపూజించి, 'చిత్రగ్రీవా! చెలికాఁడా! యెంతవారికిఁ గాని పూర్వ కర్మ మనుభవింపకతీఱదు. వలఁ దగులుకొలునకు నొచ్చుకొకు. సమ స్తము తెలిసినవాఁడవు. నీకు నాబోఁటులు చెప్పెడు పాటివారుగారు.' అని యూఱడించి, బలఁగంబుతోఁ జిత్రగ్రీవున కాతిథ్యము సేసి, కౌఁగి లించుకొని, వీడుకొలిపెను. అనంతరము చిత్రగ్రీవుఁడు తన పరిజనము లతో హిరణ్యకుని గుణములు కొనియాడుచు నిజేచ్ఛం జనియె. 'మిత్ర లాభముకంటె మించినలాభము లోకమందేదియుఁ గానము. కాఁబట్టి బుద్ధిమంతుఁడు పెక్కండ్రు మిత్రులను సంపాదించుకొవలెను. ఒక్క మూషికముతోడి మైత్రి కపోతముల కెంత కార్యము చేసినది చూచితిరి,' అని చెప్పి, మఱియు, విష్ణుశర్మ యిట్లనియె. అనంతరము హిరణ్యకుండు లాఁగఁ జొచ్చెను. పిమ్మట లఘుపతనకము జరగిన సర్వ కార్యమునకు వింతపడి హిరణ్యకుని లాఁగదాపున వ్రాలి యిట్లనియె. 'ఓహో హిరణ్యకా! కొనియాడఁ దగినవాఁడవు గదా! నేను నీతో సఖ్యముఁగోరి వచ్చితిని అనుగ్రహింపుము. నా కోరిక సఫలము చేయుము.' అనిన విని హిరణ్యకుఁడు లాఁగలోపలనుండి యిట్లనియె. 'ఎవ్వఁడవు నీవు?', అనవిని కాకి యిట్లనియె. 'నేను వాయసమను; నాపేరు లఘుపతనకము. అనఁగానే హిరణ్యకుఁడు నవ్వి సరి సరి. నీతోనా మైత్రిచేయవలె! ఏది ఎవ్వరితోఁదగునో వారితో బుద్ధిమం తుఁడది చేయవలె. తగనికార్యము చేయరాదు. నేను భోజ్యమను. నీవు భోక్తవు. మనకు మైత్రి యేలాగున సరిపడును? నీతోమైత్రి నాకు విపత్తునకే కారణము. పూర్వమొక మృగము జంబుకమును నమ్మి దాని కపటవచనములకు లోఁబడి పాశములోఁ దగులుకొని వాయ సముచేత రక్షింపఁబడియె. అనిన, 'సవిస్తరముగా నాకది చెప్పుమ'ని లఘుపతనకమడిగెను. హిరణ్యకుం డిట్లనియె.

'మగధదేశమందు మందారవతియను వనము గలదు. అందు బహుదినములనుండి మృగ కాకములు రెండు మిక్కిలి సఖ్యముతో వాసము చేయుచుండు. ఆమృగము లెస్సగా బలిసి వనములో విచ్చల విడి సంచరించుచుండ నొక్క నక్కచూచి యిట్లు చింతించె. 'ఆహా! యీజంక యెంత పోతరించి యున్నది? ఏలాగున దీని మాంసము నాకు లభించును? మంచిది. దీనికి నమ్మకము పుట్టించెద' నని యాలోచించి, తిన్నఁగా సమీపము చేరి యిట్లనియె. 'మిత్రుండా! కుశలమా? అనఁగానే విని, 'యెవ్వఁడవునీవ'ని మృగ మడిగెను. 'నేను నక్కను. నాపేరు సుబుద్ధి. నాబంధువులందఱు నన్నొంటిసేసి పోయిరి. ఈ యడవిలో మృతకల్పుఁడనయి యున్నవాఁడను. మఱి యెవ్వరితోఁగాదు, దైవముతోఁ జెప్పుచున్నాను. వినుము. నిన్నుఁ జూడఁగానే నా బంధువులందఱు వచ్చినట్లు తోఁచినది. సజ్జనదర్శనము సమస్తదోషములు పోఁగొట్టును. సర్వసుఖము లిచ్చునని పెద్దలు సెప్పుదురు. దానికిదే తార్కాణము. నేను నీతోడ సహవాసము చేయవలెనని మిక్కిలి కోరుచున్నాఁడను. నా కోరిక నెఱవేర్పుము' అనిన విని, 'మంచిదాలాగుననే కానిమ్మ'ని మృగము నక్కను వెంటఁబెట్టుకొని పోయి సాయంకాలము తన వాసస్థానము చేరెను. అక్కడ మందార వృక్షముమీఁది కాకి తన మిత్రమయిన మృగమును జూచి 'యెవ్వఁడీతఁడ'ని యడిగెను. ఈతఁడు సుబుద్ధియను జంబుకోత్తముఁడు. నా చెలిమిఁగోరి వచ్చినవాఁడని జింక చెప్పె. ఆమాటలు వాయసము విని యిట్లనియె. 'క్రొత్తగా వచ్చినవానిని నమ్మవచ్చునా? ఇప్పుడు నీవు చేసిన పని మంచిదికాదు. కులశీలములు తెలియక యెవ్వరికిఁగాని తా విచ్చుట తగదు. పూర్వము మార్జాలమునకు జరద్గవమను గృధ్రము తావిచ్చి మృతిఁబొందెను. అది సవిస్తరముగా వివరించెద వినుము.

భాగరథీ తీరమందు గొప్ప జువ్వివృక్షము గలదు. దాని తొఱ్ఱలో జరద్గవమను చీకు ముసలిగ్రద్ద వాసము చేయుచుండును. ఆ వృక్షముమీఁద నివసించు పక్షులు దానికి జీవనముకయి తాము

తెచ్చుకొన్న యెరలోఁ గొంచెము కొంచెము పంచి యిచ్చుచుండును. అది దానితో జీవనము చేయుచుండెను. ఒకనాఁడు దీర్ఘకర్ణ మను పిల్లి పక్షిపిల్లలను భక్షించుటకై యా మ్రానికడకు సద్దుచేయక వచ్చెను. దాని రాకచూచి పక్షిపిల్లలు భయపడి కూయసాగెను. ఆ కోలాహలమును జరద్గవము విని యెవ్వరో పరులు వచ్చుచున్నారని యెంచుకొని, 'యెవరక్కడ?' నని హెచ్చరించెను. అప్పుడు బిడాలము గ్రద్దను జూచి భయపడి, 'హా! చచ్చితిఁగదా! కడు దాపునకు వచ్చితిని; మరిఁగి పోనయితిగాదు; తప్పించు కొనుట కుపాయాంతరము లేదు; కార్యము మించినది; ఇప్పుడు వెనుదీయరాదు; కానున్నది కాకమానదు; 'ఱోటిలోఁ దలఁదూర్చి రోఁకటిపోటునకు వెఱవఁదేఱునా?' మంచిది. ఇప్పుడు మంచితనము చూపి దీనికి నమ్మిక పుట్టఁజేసెద'నని యాలోచించి, యెట్టయెదుర నిలిచి యిట్లనియె. 'అయ్యా! నమస్కారము' అనఁగానే గృధ్రము విని, 'యెవ్వఁడవు నీవ'ని యడిగెను. 'నేను బిడాలమను; నన్ను దీర్ఘకర్ణమని చెప్పుదురు' అన విని గృధ్రమిట్లనియె. 'శీఘ్రము దూరముగాఁ బో; పోకుంటివా నీ ప్రాణములు నీవికావు. చూడు నాదెబ్బ.' అనఁగానే బిడాలమిట్లనియె. 'ముందు నా మాటవినుఁడు. నేను వధ్యుఁడనో కానో విచారింపుఁడు. తర్వాత మీకుఁ దోఁచినట్లు చేయుఁడు. గుణదోషములు విచారించి వీఁడు పూజ్యుఁడు, వీఁడు వధ్యుఁడని నిర్ణయింపవలెఁ గాని జాతిమాత్రముచేత నిర్ణయింపఁగూడునా?' నావుడు, 'నీవు వచ్చినపని యేమ'ని గృధ్రమడిగెను. పిల్లి యిట్లనియె. 'ఇక్కడ గంగలో నిత్యము స్నానము చేయుచు మాంసాశనము విడిచి బ్రహ్మచారినై † చాంద్రాయణ

† చంద్రకళల ననుసరించి ప్రతిదినము భోజనములో హెచ్చు తగ్గులుగా నాచరించు నొక వ్రతము—శుక్ల పక్ష ప్రతిపత్తు మొదలు దినమున కొక్కొక్క కబళము వంతున హెచ్చించుచుఁ బున్నమనాఁడు పదునైదు కబళములు తిని, కృష్ణపక్షపుఁ బాడ్యమి మొదలు దినదినమున కొక్కొక్క కబళము తగ్గించుచు నమావాస్యనాఁ డుపవాస ముండవలయును. ఉప్పు, పులుసు, కారము వర్జిత పదార్థములు. ఈ వ్రతమొక్క యేఁ డాచరింపవలయును.

నీవడిగిన ప్రశ్నంబు ధర్మసూక్ష్మం బెఱింగి వివరింప శక్యంబు గాక యున్నయది. ఈ యజాతశత్రుండు నిఖిలమహీతలంబును, ధనరత్న సంచయంబులును, బరిహరించినం బరిహరించుం గాని, సత్యంబు వదలఁడు. అట్టి యితండు పరాజితుండ నైతినని యె. ఈ సౌబలుండు దురోదరంబునకు నద్వితీయుండును, గపటాత్ముండును నగుట వంచనోపాయం బెంచు కేనియు నెఱుంగని యుధిష్ఠిరుని జూదంబునకుం బిలిచి జయించె. ఇన్ని విధంబులై యున్నది. కాన, నెఱింగి, పలుక నాకు నలవిగాదనిన, ద్రౌపదీదేవి, కపటాత్ములును, ద్యూత విద్యావిశారదులును, దుర్జనులును నగు శకుని ప్రభృతులు గూడి, పరిశుద్ధహృదయుండై దేవనంబునెడ నేర్పులేని యితని బలాత్కారంబునం బిలిచి జయించిరి. పదంపడి, నన్నుం బన్నిదంబునకుం బూన్పమని పలికిరి. ఇవ్విధంబున నడిచెం గావున, నీయెడంగల కౌరవశ్రేష్ఠులు తమ కుమారులకును, గోడం డ్రందఱికిని శిక్షకులు గాన, నిదెంతయునుం బరామర్శించి, యున్నరూపెఱింగింపవలయు. వృద్ధులు లేనియది సభ కాదనియును, ధర్మం బెఱింగి పలుకనివారలు వృద్ధులు గారనియును, సత్యరహితం బగునది ధర్మంబు గాదనియును, నొక నెపంబునం బలుకునది సత్యంబు గాదనియునుం బలుకుచు, నతికరుణంబుగ వగచుచుం, దన వల్లభుల నిరీక్షించుచు నుండెడు ద్రౌపదీదేవిని, దుశ్శాసనుం డతిపరుషంబులును, నప్రియంబులును నగు భాషణంబు లాడుచున్న సమయంబున, గళితోత్తరీయయును, బుష్పవతియునునై సభాసదుల నిందింపుచుండెడు పాంచాలిం గనుంగొని భీముండు, రోషారుణిత లోచనుండగుచు ధర్మనందను నుద్దేశించి,

X

'పాండునందనా! లోకంబున ద్యూత పరాయణులై ప్రవర్తిల్లెడు ధూర్తులకు వేశ్యలును, దాసీజనంబులునుం గలిగియుండుదురు. వారల

నేనియును బన్నిదంబునకుం బూన్చి యోడుట కనియును నెఱుంగము. ఇట్టియెడ దయాహీనుండవై యింత చేసితివి. నీవు మాయందఱకును రాజ వగుటంజేసి, నానామహీపాలకులు గానుకలు తెచ్చిన నవరత్నంబులును, వాహనంబులును, గవచంబులును, నాయుధంబులును మొదలగు వస్తువిశేషంబులును, రాజ్యంబును, మమ్మును, నీశరీరంబును బన్నిదంబునకుఁ బూన్చి, శాత్రవులపాలు సేసిన దీనికినై కోపంబు జనింపదు. ఈపాంచాల రాజనందనం బన్నిదంబునకు నొడ్డి, యను చితంబు గావించితివి. పాండవేయులం బొందియును, నీబాలికా రత్నంబు, కపటాత్ములును, క్షుద్రులును, గ్రూరులును నగుకౌరవులచే నిన్ని పాట్లు పడుచున్నయది. అతిసుకుమారాంగియగు నీ వధూతిలకంబునకు నీవలన నిన్నియాపదలు వాటిల్లెంగాన, నాకోపంబునకు నిన్నే లక్ష్యంబుగావించి, నీ బాహుయుగంబు దహించి వైచెద'నని సహదేవు నుద్దేశించి, 'యగ్నిం గొని తె'మ్మని పలుకునంత, నతనిం గనుంగొని యర్జునుండు, 'పవననందనా! ఇట్టివాక్యంబులు మున్నెన్నండును బలుకుదువే? దీనివలనం గపట స్వభావులగు నీవైరులు, 'భీముండింత మాత్రంబువాఁడే'యని నీ ధర్మగౌరవంబు నిందింపుదురు. కాన, శాత్రవులకు నపకారంబు గల్పింతువే? ధార్మిక శ్రేష్ఠుండగు నీధర్మనందనుని నతిక్రమింపక, ధర్మంబె యవలంబింపుము. ఈయజాత శత్రుండు, తనకు జూదంబునందుం బ్రియంబు లేక యుండియు, నెవ్వండేని దురోదరంబునకుం బిలిచిన నాడక మాననని ప్రతిజ్ఞ సేయుట మనకుం గీర్తికరంబుగాదె?' అనిన, వృకోదరుండు ధనంజయు నుద్దేశించి, 'యిట్టిదురవస్థకుం బాలుపఱచిన యీతనిబాహుయుగంబు బలాత్కారంబునం బట్టి దగ్ధంబు సేయం జెల్లదె?' యని యిట్లు పాండవేయులును, పాంచాలియును బహుదుఃఖార్తులై యుండెడు సమయంబున దుర్యోధనసహోదరుఁడగు వికర్ణుండు, సభాసదులం గలయం గనుంగొని, 'రాజవర్యులారా! ఇప్పు డీయాజ్ఞసేని యడిగిన

ప్రశ్నంబునకు ధర్మరహస్యం బెఱింగి యుత్తరం బొసంగమైతిమేని, మనకు నెల్లవారలకు నిప్పుడె నరకంబు ప్రాప్తించు. కురుకులశ్రేష్ఠులగు భీష్మధృతరాష్ట్రులును, మహాబుద్ధి సంపన్నుఁడగు విదురుండును, శిక్షకుండగు కృపాచార్యుండును, ద్రోణుండును గలిగియుండి, యిందఱు నీ సంశయంబు దీర్పకుండుట యుచితంబగునె ?' యనిమఱియును, నానా దేశాగతులగు భూపతులనుద్దేశించి, 'యీద్రౌపదీదేవి పలుమా ఱడిగిన ప్రశ్నంబునకుం గామక్రోధాదులు మాని, ధర్మసూక్ష్మంబు విచారించి, మీమీబుద్ధులకుం దోఁచు తెఱం గెఱింగింపుఁ'డనుచు, సారెసారెకుం బలికి, వార లొండేమియునుం బలుకక యూరకున్నం గనుంగొని, నిట్టూర్పు నిగుడించుచు, మఱియు, వారల నుద్దేశించి, 'మీర లెఱింగి పలికినను, దెలుపకున్నను నేమి, నాకుం దోఁచిన ధర్మమార్గం బెఱింగించెద. ఆకర్ణింపుఁడు.

౬

'లోకంబున రాజులకు జూదంబును, పానంబును, వనితాసక్తియును, వేఁట వెడలుటయును ననియెడు చతుర్విధ వ్యసనంబులుగలవు. వీనియెడ నాసక్తుండగు పురుషుండు, ధర్మదూరుండై మెలంగుం గావున, నతం డాచరించినది కృత్యంబని తలంపరాదని రాజనీతి విధిజ్ఞు లెఱింగింతురు. అట్లగుట నీ ధర్మనందనుండు ద్యూతాసక్తుండగుట వలనను, నితని జూదంబునకు బలాత్కారంబునం బిలిచి యాడుటవలనను, ద్రౌపదిని బన్నిదంబునకుం బూన్పుమని శకుని తానె యడుగుటవలనను, నీ ద్రుపదరాజపుత్రి పాండవులేవ్వర కధీన యగుటవలనను, యుధిష్ఠిరుండు మున్ను తనోడి, పదంపడి, దీనిం బన్నిదంబునకు నియమించుట వలనను, నీ యాజ్ఞసేని జయింపంబడినది గాదని నామనంబునం దోఁచుచున్నది.' యను నీతని వాక్యంబు లాకర్ణించి, యా సభాసదులలోన నా వికర్ణునిఁ బ్రశంసించువారల వచోనినాదంబులును, సౌబలుని నిందించువారల

వాక్యధ్వనులును, నొక్కటం బిక్కటిల్లుచుండం, గర్ణుండు క్రోధావేశ వశుండగుచుం గరంబెత్తి, కలకలంబు నివారింపుచు, నీ వికర్ణునియెడ ననేక వికృతంబులు గలిగియున్నయవి. అరణివలనం బొడమిన యగ్ని దానిన దహించుతెఱంగున, నితండు తా జనియించిన కౌరవ వంశంబు నకు నెల్ల నాశంబు గావింపుచు నున్నవాఁడు. శరీరంబునం బ్రభవించిన రోగంబు దానికి హాని గావించు చందంబునం, దనకు జీవనంబగు తృణంబు ద్రొక్కెడు పశువుచందంబున, నితండు స్వపక్షంబునకుఁ గీడొనరింపనున్నవాఁడని మఱియు, నతని నుద్దేశించి, 'ద్రోణుండును, భీష్ముండును, గృపాచార్యుండును, నశ్వత్థామయును, మహాబుద్ధి సంపన్నుండగు విదురుండును, ధృతరాష్ట్రుండును, గాంధారియును మొదలగు వీరలు గదా పాంచాలి ప్రశ్నగావించె? వార లెల్లరును ధర్మమార్గంబున జయింపంబడిన యది యని తలంచి, ప్రత్యుత్తరం బొసంగక యూరక యుండెదరు. నీవు బాలుండ వయ్యును సర్వజ్ఞుని చందంబునం బలికెదవు. నీవు మందబుద్ధి వగుటంజేసి ధర్మసూక్ష్మం బెఱుంగక, యీ యాజ్ఞసేని జయింపంబడిన యదిగాదని, సభామధ్యంబునం బలికెదవు. ఈ పాండవాగ్రజుండు తనకుం గల సర్వంబును నోడి, ద్రౌపదినిం బణ్ణిదంబునకుం బూన్పుమని శకునివల్కు, సమ్మతించి యిట్లని నియమించె. ఎల్లవార లెఱుంగ నోడియుండెడు తఱి నివ్విధంబునం బలుకం దగునె? రజస్వలయును, నేకవస్త్రయునునై యుండెడు వనితను సభకుం గొనితెచ్చుట యుక్తంబగునె యని యడిగితేనిం జెప్పెద నాకర్ణింపుము.

౭

లోకంబున నొక్క కాంతకు నొక్క మగండని దైవంబు గల్పించె. ఇది యేవురకుం భార్యయై యున్నయది గాన, దీని వేశ్య

యని నిశ్చయించితి. అట్లగుట నెట్లుండెనేనియును సభకుం దెచ్చుట యకృత్యంబు గాదు. ఈ పాండవేయుండు సకల ధనంబును, రాజ్యంబును, సహోదరులను, ద్రౌపదిని ధర్మప్రకారంబున సౌబలునకు నోడుట యెఱింగి యుండియును, బాల్యంబునం జేసి యీ వికర్ణుం డివ్విధంబున నెఱుంగక పలుకుచున్నవాఁడని, దుశ్శాసను నుద్దేశించి, 'యీ కౌంతేయులుం బాంచాలియు ధరించిన వస్త్రంబుల నపహరింపు'మను నతని వాక్యంబు లాకర్ణించి, పాండవులు తాము కట్టియుండెడు వసనంబుల వీడక, యుత్తరీయంబులు దిగిచి, సభామధ్యంబున వైచి, యూరకయుండిరి. అంత, దుశ్శాసనుండు ద్రౌపది వస్త్రంబు లపహరింపవలయునని బలాత్కారంబునం జేలాంచలంబు వట్టి యీడ్చుచుండెడు సమయంబున, నద్దేవి, 'మహత్తరంబగు నాపదం బ్రాపించినయెడ జగదీశ్వరుండగు నారాయణుని సంస్మరింపవలయు'నని వసిష్ఠ వచనంబులు గలవని వినియున్నదగుటం జేసి, 'గోవింద! కృష్ణ! అచ్యుత!' యని పలుమాఱునుం బలుకుచు, నాపన్నివారకుండును, లోకేశ్వరుండును, దేవదేవుండును నగు జనార్దనుని సంస్మరింపుచు, మఱియును, 'శంఖచక్రగదాధర! నాశరహిత! గోవింద! పుండరీకాక్ష! ద్వారకాపురనివాస! యదునందనా! నీ వెందున్నవాఁడవు? అనాథ తెఱంగున నిట్టి దురవస్థం జెంది శరణాగతనగు నన్ను రక్షింపక యుపేక్షింపఁ దగునే!' యని బహువిధంబులం బ్రార్థింప, నరనారాయణాత్మకుండును, విశ్వవ్యాపకుండును, ధర్మస్వరూపకుండును నగు నా కృష్ణుండు ప్రత్యక్షంబుగ నిలిచి, పతివ్రతా శిరోరత్నంబగు పాంచాల రాజనందనకు నానావిధంబులగు వస్త్రంబు లక్షయంబు లగునట్లు వరం బనుగ్రహించె. అంతఁ బాపచిత్తుండగు, నా దుశ్శాసనుండు, పాంచాలి వసనం బపహరింప, నట్టి యంశుకంబు వే ఱొక్కటియుండ నదియునుం గ్రహించి, మఱియు వస్త్రంబు గట్టినయట్ల నదియునుం దోఁచి యిత్తె

ఱంగు నానావిధంబులగు నంబరంబులుగాఁ గైకొనె. ఇవ్విధంబున నా దురాత్ముండు మఱియు నపహరింపుచు నుండ, బహువిధంబులగు చేలం బులు శరీరంబునం బుట్టిన కైవడి నొక్కటం బ్రభవింపుచుండె. ఆ సమయంబున సభాసదులట్టి మహాద్భుతంబు గనుంగొని, ద్రౌపదీదేవి పాతివ్రత్యంబు పలుతెఱంగులం బ్రశంసించువారును, దుర్యోధనాదు లగు ధార్తరాష్ట్రులు దుష్టాత్ములని నిందించువారునునై యుండ, నా దుశ్శాసనుండు వస్త్రంబులు సభామధ్యంబున ననేకంబులగు రాసు లుగాఁ దిగిచివైచి, లజ్జితుండై, విశ్రాంతిఁ జెంది, చదికిలం బడియె.

౮

అంత భీమసేనుండు కోపాటోపంబున నోష్ఠము గఱచి, కరపీడ నంబు గావింపుచు, సభాసదులై యుండెడు మహీపాలకుల నుద్దేశించి, 'రాజవర్యులారా! మున్నొకండు వలుకని యదియును, నిటమీఁద నొకండు వలుకుటకు నలవిగానిదియును నగు నొక్క ప్రతినఁ గావిం పుచు నున్నవాఁడ. ఆకర్ణింపుఁడు. దుర్బుద్ధియును, బాపాత్ముండును, భరతకుల నికృష్టుండును నగు నీ దుశ్శాసనుని వక్షస్స్థలంబు బలా త్కారంబునం బట్టి, వ్రక్కలించి, రుధిరంబు గ్రోలంగలవాఁడ. అట్ల సేయనైతినేని మానవశకర్తలైన పూర్వ రాజన్యులు పోయిన గతికిం బోవంగలవాఁడ'నని బిట్టుగం బలుకు పవననందనుని ప్రతిజ్ఞాభాషణంబు లాలకించి, ప్రమోదంబునం బొదలి, యతనిం గొనియాడుచు, సకల నరేంద్రులు, కౌరవుల దూషించు శబ్దంబులు సభామధ్యంబున నొక్కటం బిక్కటిల్లె. అంతం గొందఱు సత్పురుషులు, 'యాజ్ఞసేని యడిగిన ప్రశ్నంబునకుం గటకటా! యొక్కఁడేనియును నుత్తరం బొసంగఁడయ్యె' నని వగచుచు, నాంబికేయుని బహువిధంబులం దిట్టుచునున్న సమయం బున, నఖిలధర్మవిధిజ్ఞుండగు విదురుండు దిగ్గనలేచి, బాహుదండంబు

పొడవుగ నెత్తి, కలకలంబు నివారింపుచు, 'సభాసదులారా! యీ పాంచాలి యడిగిన ప్రశ్నంబు మీరెవ్వరును వివరింపనేరరైతిరి. కాన, దురాత్ములగు నీ కౌరవులచే నిట్టి క్లేశంబు లనుభవింపుచు సనాథ తెఱంగున నేడ్చుచున్నయది. లోకంబునం బ్రశ్నంబనియెడు ననల జ్వాలిక సభామధ్యంబునం బ్రవేశించి, ధర్మంబనియెడు జలంబుల సజ్జనులచే నార్పంబడదేని యది యెల్లవారల దహించు. అట్లగుట మీకు నధర్మంబు వాటిల్లె. ప్రశ్నంబునం గల యర్థంబు న్యాయంబుగఁ బలుక సత్పురుషులకుఁ గాక, కామక్రోధ వశాత్ములగు వారలకుఁ గూడునె? ప్రాజ్ఞుండగు నీ వికర్ణుఁ డీ ద్రుపదరాజపుత్రి యడిగిన వాక్యం బున్నరూపెఱింగించె. మీరలును దోఁచిన విధంబున వివరింపుఁడు. ధర్మసూక్ష్మం బెఱింగిన పురుషుండు తాఁ దెలిసియును వివరింపఁడయ్యేనేని, ననత్యంబు వలనం గలుగు దోషంబు సగం బనుభవించు. అది విపరీతంబుగఁ బలికెనేని యనృత దోషం బంతయును జెందు. ఇది నిశ్చయంబు; అట్లగుట యీ ధర్మరహస్యం బింతయును విచారించి, యాజ్ఞసేని యడిగిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరం బొసఁగుఁడ'ని పలుకు విదురుని వచనంబు లాకర్ణించి, యా సభాసదులందఱును నూరకయుండునెడ, రాధేయుఁడు, దుశ్శాసను నవలోకించి, 'దాసియగు నీపాంచాలిని గృహంబునకుఁ గొనిపో'మ్మనియె. అంత నతఁడు లజ్జాభరంబునఁ జలింపుచుఁ, బలుమాఱును బాండవుల నిరీక్షింపుచు నుండెడు పాంచాల రాజకన్యం బట్టి తిగిచె.

౬

ఆసమయంబున ద్రౌపదీదేవి సభాసదుల నుద్దేశించి, 'యీ దురాత్ముండగు దుశ్శాసనుండు నన్ను బలాత్కారంబున నీడ్చికొని వచ్చె. నెడఁ గురువృద్ధులగు మీర లుపేక్షసేయఁ దగునే యని, ధర్మంబు మును మీరెఱిఁగినటిరిగదె నను నిది నాయెడఁ గొఱంత గాద'ని పలుకునెడ.

దుశ్శాసనుండు చెఱఁగు పట్టి యీడ్వ, దుఃఖార్త యగుచు సభామధ్యం బునఁ బడి, నన్ను స్వయంవర సమయంబున నిఖిలరాజన్యులు కనుంగొనుటయె కాని, సూర్యచంద్రులేనియు నెఱుంగకుండ నంతఃపురంబున వసియించి యుండెడు నన్ని ప్పుడీదురాత్ముం డీ సభకుఁ గొనితెచ్చుటవలన, నందఱుం గనుంగొన రాజమధ్యంబున నిలిచితి. నామీఁద వాయువు సోఁకుటకైనను సైఁపని పాండునందను లీ దురాత్మునిచే నిట్టిదురవస్థం బడుట కనుంగొని యెట్లు సహించెదరో! ఈ కురు వృద్ధులకుం గోడల నగు నేను సభామధ్యంబున నిట్లు క్లేశపడుటకు నుపేక్షించి యుండుట వలన, నది కాఁగల వైపరీత్యంబు గానోపు! సుకుమారదేహియును, బతివ్రతయును నగు నేను సభామధ్యంబున వీనిచే నిన్నిపాటులఁ బడుట కంటె దైన్యంబిఁక నేమి యున్నయది? రాజులయెడ ధర్మంబు గలదె? అంతఃపుర వధూజనంబుల సభకుఁ దెచ్చుట యుక్తంబు గాదన వినియుందుము. అట్టిసనాతనంబగు ధర్మం బీకౌరవులవలన నేఁటితోడన వినాశంబు నొందె. ధృష్టద్యుమ్నునకు సహోదరియును బాండవేయులకు భార్యయును, వాసుదేవునకు సఖియును, సత్కుల ప్రసూతయును, బతివ్రతయునగు నేను దాసి నగుటయును, గాకి యుండుటయును, నెఱింగింపుఁడు. ఈపాపకర్ముండు కౌరవుల కీర్తి వినాశకుండగుచు, నన్ను నెంతయును బాధింపుచు నున్నవాఁడు. ఇంక సైరింప నలవికాదు. పలుమఱుం బలు కుటకుఁ, బ్రత్యుత్తరం బొసఁ గక యూరకుండ నేటికి? నన్ను వీరలు జయించుటయును, జయిం పక యుండుటయును, ధర్మసూక్ష్మం బెఱింగి వివరించితిరేని యట్లన కావించెద'నని శోకార్తయగుచు బహువిధంబులఁ బలువరింప, దేవ వ్రతుండు ద్రౌపది నుద్దేశించి, 'ధర్మసూక్ష్మం బెఱింగి వివరింపు మని యడిగితివి గదా! ఇది మహానుభావులగు బ్రాహ్మణుల కేనియు దెలుప నలవిగాదు. లోకంబున బుద్ధిసంపన్నుండగు నతండు సకల ధర్మసూక్ష్మంబు లెఱుంగు. అతని నీతివచనంబులధర్మంబు విన్కుటఁ

బై యుండెడు చోటఁ జనిగొనవు. ధర్మంబు సూక్ష్మంబును, గహనంబును, ప్రబలంబును నగుటనిది నావలన నిశ్చయింపఁ గూడకయున్న యది. ఈకౌరవులు లోభ మోహ పరాయణు లగుటంజేసి, వీరలవంశంబునకు శీఘ్రంబుగ వినాశనంబు రాఁగలయది. లోకంబున మహాకుల ప్రసూతులగు వారలు మహావ్యసనంబు జెందియును, ధర్మంబు వదలక ప్రవర్తిల్లుదురు. కావున, నీవిప్పు డిట్టి దురవస్థలం బొందియును, ధర్మం బవలంబించి యున్నదానవగుట నీచరిత్రంబు ప్రశంసకుం దగియె. వృద్ధులును, ధర్మ విధిజ్ఞులును నగు నీద్రోణ ప్రభృతులెల్లను శిరంబులు వంచి, నిశ్చేష్టితులై యున్నవారలు. కాన సమస్తధర్మ విశారదుండగు యుధిష్ఠిరుండె నీ ప్రశ్నంబునకు నుత్తరఁ బొసంగఁ గలవాఁడని నిశ్చయించితి.

౧౦

ఆ సమయంబునఁ గర్ణుండు యాజ్ఞసేనిం గనుంగొని లోకంబున దాసుండును, శిష్యుండును, వనితయును, నను నీ ముగ్గురు నస్వతంత్రులు; గానఁ గౌరవదాసులగు నీ పాండవేయుల పత్నివగుట నీకు స్వాతంత్ర్యంబు; లేదు. నీకు నధిపతు లీ ధార్తరాష్ట్రులు. వీరల గృహంబుల దాసీ కృత్యంబులు గావింపుచు నుండుము. ఈ పాండునందనులు జూదంబున నిన్ను నోడుటం జేసి, వీరలు నీకు నధీశ్వరులు కారు. ఇంకనేనియు నీకు దాస్యంబు సంపాదింపని వానింగా నొక్క మగని వరింపుము. ఇన్నిదినంబులు నీవల్లభులయెడ భయభక్తులు గలిగి నడచిన తెఱంగున దాస్యంబులం దట్లప్రవర్తిల్లుము. వీరలకుం బ్రతాపంబును, పౌరుషంబును గలుగుటకు ఫలంబుగదా నిన్ను దురోదరంబున నోడుట?' యను నతని వచనంబు లాకర్ణించి, కోపశీలుండును, ధర్మపాశబద్ధుండును నగు పవమానసుతుండు, మహాభుజంగబుం

చందంబున నిట్టూర్పు నిగుడించుచు, నతని దహించు తెఱంగున రోషారుణ వీక్షణంబులం జుఱజుఱం జూచుచు, ధర్మనందను నుద్దేశించి, 'నీవు పన్నిదంబు వైచి యోడుటవలన వారలకు దాసుల మైతిమి. కాన, నీరాధేయుండు పలికిన పలుకులకు నామనంబునకుం గోపంబు లేదు. ఈ ద్రౌపదిని నీవు జూదంబునం బన్నిదంబునకుం బూన్పవైతేని, వీరలిట్లాడుదురె' యను వృకోదరుని వాక్యంబులు విని రారా జచేతనుని కైవడి మౌనముద్రతో నుండెడు ధర్మపుత్త్రు నుద్దేశించి, 'యీ భీమార్జున నకుల సహదేవులు నీయాజ్ఞలోన మెలంగెడు వారలగుట నూరకయున్నవారలు. ఇప్పాంచాలి మాచే జయింపంబడుటయును, లేకయుండుటయును నీ వెఱింగింపు'మని పలికి, కదళీకాస్తంభ సంకాశంబును, సర్వలక్షణ లక్షితంబును, గరికరోపమానంబును, వజ్ర ప్రతిమానంబును నగు తన యూరుతలంబును మందహాస ముఖుండగుచు ద్రౌపదికిం జూపు సమయంబున, వాయునందనుండు క్రోధ తామ్రాక్షుం డగుచు, నెల్లవారలు విన, 'నిప్పుడీ దురాత్ముండు యాజ్ఞసేనికిం జూపిన యూరుకాండంబులు నా గదా ప్రహారంబున నుగ్గునూచంబు సేయనైతినేని పితృలోకంబునకు వెలిగాంగల వాండ'నని యెల్లవారు నెఱుంగ బిట్టుగాం బలుకు భీమసేనుని రోమకూపంబుల వలన నుండియును, విస్ఫులింగంబు లనలజ్వాలాదహ్యా మానంబగు వృక్షకోటరంబులనుండి పడియెడు నగ్నికణంబుల తెఱంగున నొక్కుమొగి రాలుచుండె. ఆ సమయంబున విదురుండు సుయోధను నుద్దేశించి, 'యీ పవనాత్మజుని దేహంబువలనం దొఱంగెడు మిణుంగురులు కనుంగొంటివె? ఇతనివలనం గౌరవాన్వయంబునకు నెల్ల మహా భయంబు రాంగలదని యెఱుంగుము. దైవసంకల్పంబుచే నీ భరత వంశంబున కనర్థంబు వాటిల్లె. మీరలిప్పుడీ దురోదరం బాడి లోకంబునలేని యకృత్యంబుగ నింత భంగపఱచుటవలన శ్రేయంబునకు

హాని బ్రాపించఁగలయది. జయింపఁబడినయది యని యాతురువృద్ధు లెల్లరుఁ జింతాక్రాంతులై యున్నవారలు. దుష్టాత్ములచే నీ సభ దూషితంబయ్యె. ఈ ధర్మనందనుండు దన్నునోడక తొలుతఁ, బాంచాలిఁ బణ్ణిదంబునకుఁ బూన్చెనేని యిది జయింపఁబడిన యది యగు. మున్నె తనోడి, పదంపడి యోడినవాఁడగుట, నియ్యాజ్ఞసేని గెలువంబడిన యదిగాదు. ఈ సౌబలుని దుర్నీతులు విని పాండవుల ధనం బెట్లపహరించితివి? అది స్వప్నలబ్ధంబగు ద్రవ్యంబు చందం బునం బోవుం గాక నిలువనేర్చునె? ఇంకనేనియు నావంచకుని వాక్యంబు లాకర్ణించి యపకీర్తిం బాలుపడక యుండు'మనిన, సుయో ధనుండు విదురునిం గనుంగొని, 'నీవాడినట్లన యీ భీమార్జున నకుల సహదేవులును, బాంచాలి నోడుటకు స్వాతంత్ర్యంబు లేదని రేని, విడిపిం చెద'ననిన, నర్జునుండు సభాసదుల నుద్దేశించి, 'యీ ధర్మనందనుండు జూదం బాడక మున్న మాకందఱకు నధీశ్వరుండు; తాను బరాజితుం డైన యనంతరంబున ద్రౌపదికి నధీశ్వరుం డెట్లగు? కౌరవ శ్రేష్ఠులెల్లరు నీయర్థంబు విచారించి తెలియుఁ'డను నెడ, సూతపుత్త్రుండు దుశ్శాసను నుద్దేశించి, 'వీరలతోడ వృథాలాపంబు లాడ నేటికి? నా వచనప్రకా రంబున ద్రౌపదిం గొనిపోయి, దాసిగా నేలుకొను'మని పలుకు కర్ణుం గనుంగొని, గాంధారరాజనందనుండగు శకుని యుక్తంబుగఁ బలికితి' వని ప్రశంసించె.

## ౧౧

అంత, దుశ్శాసనుండు పాంచాలిని దాసీగృహంబునకుం దోడ్కొని పోవుటకునై బలాత్కారంబునం దిగువ, దేవకన్యక యనుం బోలి యాపాంచాల రాజనందన మహారవంబుగ నాక్రోశింపుచు, 'భీష్మద్రోణ కృపవిదురాశ్వత్థామలారా! మీరు ధర్మాత్ములు. కావున

సాయాపదం దొలఁగించి రక్షింపుఁడనియును, 'ధృతరాష్ట్ర మహా రాజా! నీకోడల నగు నాక్లేశంబు వాపవేటి' కనియును, 'గాంధారీ! నీవు సకలంబు నెఱింగిన వివేకశాలి' వనియును, 'యాదవవీరజనని' వనియును, 'నీవు దుర్యోధనునివలని భయంబుదీర్చి రక్షింపక యుపే క్షింపఁదగునె? ఈదుర్జనులచేఁ బీడింపఁబడుచుండెడు నన్నుం గోడలు గదాయని నీమనంబున నించుకేనియును దయ పుట్ట'దనియును 'నివ్విధం బునం బలికెడు నామొఱయాలకించిన వాఁడిందులోన నొక్కఁడును లేఁడయ్యె. ఇటువంటి మందభాగ్యనై దుర్యోధనునిచేత నింతక్లేశం బను భవింపుచున్న నన్నుం బాండుమహీపాలుండేనియును, మహేంద్రుండును వాయుదేవుండును, నశ్వినులును నను వీరలైనను దమకోడలు గదాయని నన్ను సంరక్షింపక పోయి'రనియును, నదృష్టహీనయును, బతివ్రత యును నగు తనజీవం బింక నేటికనియును బహువిధంబులం బ్రలాపించు చుండెడు నయ్యాజ్ఞసేని నుద్దేశించి విదురుండు, 'తల్లీ! నీవాడిన వాక్యం బులన్నియు నాకర్ణించితి. ఈ కౌంతేయులొౕగాదనక యూరకయున్న వారలు. నీ ప్రియంబు గోరియుండెడు నావాక్యంబులు విని యూరక యుండుము. పాపాత్ముండును, గృతఘ్నుండును, దుర్జనసమేతుండును నగు నీ సుయోధనుండును, బుత్త్రవంతుండగు నీ ధృతరాష్ట్రుండును, నాబుద్ధి వినరై'రని యంత దుర్యోధను నుద్దేశించి, 'మహా పతివ్రత యగు ద్రౌపదికి నింత మనఃఖేదంబు గావించి వినాశంబుఁ గొనఁద నేటి' కని, యాంబికేయుని గనుంగొని, 'కౌరవేంద్రా! ఈద్రౌపదికి నింత యార్తి గావింపుచు నున్నవాఁడవు. ఇది నివారింపవైతివేని పాపాత్ముం డును, గులనాశకుండును, నగు నీసుయోధనుండు సహోదరామాత్య సమేతంబుగ ధర్మజ భీమార్జున నకుల సహదేవులచే నల్పకాలంబున నశి యించిపోయెడు' నను నతని వచనంబులకు మందబుద్ధియగు నా ధృత రాష్ట్రుండు ప్రత్యుత్తరం బొసంగఁడయ్యె. అప్పుడు దేవమాయామోహి తుండగు సుయోధనుండు విదురుని వాక్యంబులదెస ననాదరంబు గావిం

ఘుచు ద్రౌపదీదేవికిఁ బలుమాఱును దనయంకతలంబుఁ జూపుచునుండ, బలధురంధరుండును, నభిమానశాలియునగు భీమసేనుండు, రోషారుణలోచనుండగుచు. గాంధారీనందనుండు చేసిన యవమానంబునకుం బొడమిన కోపంబంతయును దనుదానె యుపశమించుకొనుచు సభామధ్యంబుననుండి దిగ్గనలేచి, రాజలోకంబు నాలోకించి, 'యెల్లభంగుల నేను సుయోధనుని సంహరింపఁగలవాఁడ. ఈ విజయుండు సూతపుత్త్రుండగు కర్ణునిఁ దెగటార్చు. సహదేవుండు దుర్ద్యూత విశారదుండగు నీ శకునిం బరిమార్చు దేవతానుగ్రహంబునం జేసి నాప్రతినకు ననుకూలంబగు నొక యుద్ధంబు వాటిల్లవలయు. ఇంక నొకటి తెలిపెద. రణరంగంబున నాదు గదా ప్రహారంబుచే దుర్యోధనుని యూరుభాగంబు గావించి, ధరాతలంబునం బడియుండెడు నితని శిరంబు నాపాదంబునం దన్నంగలవాఁడ. క్రూరకర్ముండును, శూరుండును నగు నీదుశ్శాసనుని యురంబు వ్రక్కలించి, కంఠీరవంబు చందంబున రుధిరంబు గ్రోలంగలవాఁడ'నను సమయంబున నర్జునుండు భీమసేను నుద్దేశించి 'మహాబలనందనా! నీతోడ వైరంబుగావించి తమకు రాఁగల మహాభయంబెఱుంగక దుర్బుద్ధులగుచు గృహంబుల సుఖంబున నున్నవారమని తలంపుచునుండెడు నీ సుయోధనాదుల నందఱం బొలిసినవారింగాఁ దలంపుము. సత్పురుషుండు తన శౌర్యాటోపంబులు కార్యముఖంబునం జూపుఁగాని, మాటలచే నెఱింగింపఁడు. ఈ దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు క్షత్త్రియధర్మంబున రణరంగంబునకు వచ్చి నిలిచిరేని, వీరల రుధిరంబు భూమిదేవి పానంబు సేయంగలయది. అనృతభాషణులును, దురాత్ములును నగు శాత్రవులకుం బ్రేరకుండగు రాధాతనూభవుని నీ యనుమతివలనఁ బుత్త్రమిత్ర సమేతంబుగా నిశితబాణ పరంపరలఁ జించి చెండాడుచు యమసదనంబున కనుపంగలవాఁడ. హిమాచలంబు చలించినను సూర్యబింబంబు మాసినను జంద్రునియెడ శైత్యంబు లేదయ్యె నేనియును నా ప్రతిజ్ఞకు నన్యథాత్వంబు గలుగునే?' యనెను.

౧౨

అంత, మహాప్రతాపశాలియును, సౌబలవధార్థియును, రోషారుణలోచనుండును నగు సహదేవుం డాశీవిషంబు చందంబున రోషంబున రోజుచు శకుని నుద్దేశించి, 'నృపాధమా! కౌరవవంశకీర్తినాశకుండ వగుచు జూదంబునం గదా జయించితివి? ఇప్పుడు నీచేతనుండెడి యక్షంబులు సమరసమయంబున నిశితశిలీముఖంబులై తోడ్పడునె? ఇంకను జేయనలయు పనులెల్లనుం జేయుము. పూజనీయుండును, జ్యేష్ఠుండును నగు భీమసేనుండు నన్ను నియమించి నట్లన పుత్రమిత్ర సమేతంబుగ నిన్నుం బ్రధన ముఖంబున సంహరించితినని యెఱుంగు'మనునెడ, నతి సౌందర్యశాలియగు నకులుండును సభామధ్యంబున నిలిచి, 'సౌబల సుతుండును, దురాత్ముండును, నరాధముండును నగు నీయులూకుని నెల్లవారెఱుంగ సంహరింపఁగలవాఁడ. మఱియు, నీయాజ్ఞ సేని నుల్లసంబులాడిన దుర్వృత్తులును, గాల ప్రేరితులు నగు నీ ధార్తరాష్ట్రుల ధర్మ పుత్రుండనుజ్ఞ యొసంగఁ, బాంచాలికిం బ్రియంబుగఁ దెగటార్పఁగలవాఁడ' ననునెడ, ద్రౌపది దుర్యోధనునిఁ జూచుచుఁ జూచి, 'దురాత్మా! నీ వూరు ప్రదేశంబును జూపితివి గాన, నీకు నయ్యెడ మృత్యువు ప్రాపించఁగలయది. నాకు నతిక్లేశంబు గావించిన నీ సహోదరుండగు దుశ్శాసనుని రుధిరంబు భీమసేనుండు గ్రోలంగలవాఁడు. కలుషాత్ముండగు నీ కర్ణుని బుత్ర మిత్రామాత్య సహితంబుగ ధనంజయుండు హింసించుఁగాక! ధర్మనిరతుండును, గుపితాత్ముండును నగు నీ సహదేవుండిట్టి క్రూరకర్మంబునకుఁ గారణంబైన గాంధార వల్లభుని ద్రుళ్లడఁగించు' నని యిట్లు పతివ్రతా తిలకంబగు ద్రౌపదీదేవి పలుకుచున్న సమయంబున నాకసంబుననుండి దేవతలు కుసుమవర్షంబు గురియుచుం బలు తెఱంగులఁ బాంచాలిని బ్రశంసించిరి.

౧౩

అంత నర్జునుం 'డీధార్తరాష్ట్రులెవ్వని బాహాబలంబును నమ్మి యుట్టి యకృత్యంబులు గావింపుచు నున్నవారలో యా కర్ణునిఁ బుత్ర మిత్ర సహితంబుగా సంహరింపక విడువం గలవాఁడనే' యని సత్యంబుగ నాయుధంబు పట్టుచుఁ దన ప్రతిజ్ఞ దృఢంబు గావించి,సభా సదులం గనుంగొని, 'రాజవర్యులారా! యీ ద్రుపదరాజ తనూజ నివ్విధంబున భంగపఱచిన నికృష్టాత్ములగు నీధార్తరాష్ట్రులనందఱ నొక ముహూర్త మాత్రంబున సంహరించి యమసదనంబునకుఁ బంపుదుఁగాక, సహింప నేర్తునే? ఈ ధర్మనందనుండు దయాశాలి యగుటవలన నాకు నేమియుం బలుకం గూడక యున్నయది' యను నతని వచనంబు లాకర్ణించి, భయభ్రాంతులగుచు నెల్లవారలును నూరక వసియించియుండిరి. అంత మఱియును, క్రోధ ఘూర్ణమాన హృదయుండును, శౌర్యరసోద్దీపితుం డును నగు నమ్మహేంద్ర నందనుండు దిగ్గన లేచి, గాండీవంబు కెంగేల నమర్చుచు, విరోధిరాజవర్గంబులం జుఱచుఱం జూచుచు, దక్షాధ్వర ధ్వంసంబు గావింపఁదగిన ఫాలాక్షుని చందంబున నిఖిలలోకంబులు దహించుటకు దరికొను ప్రళయకాలానలంబు పోలిక, మహాకార్ముక హస్తుండై కట్టెదుట నిలిచి, క్రోధావేశంబున నిట్టూర్పులు నిగిడించుచు నుండెడు విధంబు గనుంగొని, యతని శౌర్యాటోపంబులకు నిఖిల రాజన్యులు భయభ్రాంతు లగుచుఁ, గనురెప్ప లార్చుటకు నేనియును సామర్థ్యంబు లేక నిశ్చేష్టితులై తమప్రాణంబులదెస నిరాశులై యుండిరి. ఇవ్విధంబునఁ గ్రోధవివశుండగు పార్థుని ప్రతాపంబునకుఁ దలంకుచు మహీచక్రంబు కులాచలంబులతోఁడ గడగడ వడంకె. ఖేచరంబులగు నిఖిలభూత సంచయంబులు భయంపడియె. దివాకరుండు తేజోవిహీనుం డయ్యె. వాయుదేవుండు విసరుటకు వెఱచె. చంద్ర గ్రహ తారకా గణంబులును, దశదిశాభాగంబులును, నెట్టిపని యేర్పఱింపంబడదయ్యె.

చరాచరాత్మకంబగు నిఖిల ప్రపంచంబును గలంగంబాఱె. అట్టియెడ, నభోమధ్యంబునం దేజరిల్లు మార్తాండుని తెఱంగునం, గాలాంతక ప్రతిమానుండై కనుపట్టు నాఖండలనందనునిం గనుంగొని, భీమసేనుండు ప్రమోదంబునం బొదలుచుం, దానును యుద్ధసన్నద్ధుండై నిలిచె. అట్టియెడ, మహాభుజంగభంజనకుం గడంగు వినతానందనుని చందంబునం దోంచు ధనంజయుని నిరీక్షింపుచుం, బాంచాలరాజనందన ప్రమోదంబునం బొదలె. ఇట్లు విలయకాలాగ్ని చందంబున మండుచుం జనుదెంచు పురందర తనూభవుని వీక్షించి పౌరజనంబు లెల్లను దల్లడిల్లిరి.

౧౪

అంత, ధర్మాయత్త చిత్తుండును, దయాశాలియునగు పాండవాగ్రజుం డుపేంద్రుని నివారించు పాకశాసనుని చాడ్పునం, బురుహూతపుత్త్రునిం బట్టినిలిపి, 'యర్జునా! యీసమయంబున సాహసంబు ప్రకటించిన యశోహాని వాటిల్లదె? దుర్జాతుండగు నీరాధేయుని నేన కోపానలంబున దహింపవలయునని తలంచితి. నీవును లోకహితార్థంబుగం గోపంబు సంహరింపు' మని పలుక నతనివచనంబు లాకర్ణించి, పార్థుండు క్రోధం బడంప సకలజనంబులును బ్రమోదంబు నొందిరి. వృకోదరుండును విన్ననై యూరకుండె. అట్టియెడ ధృతరాష్ట్రుని యగ్నిహోత్ర గృహంబున సృగాలంబులును, రాసభంబులును, దుర్విహంగంబులును గూయం దొడంగె. ఆదుర్నిమిత్తంబు లాకర్ణించి, బుద్ధిసంపన్నుండగు విదురుండును, గాంధారరాజాత్మజయును, భీష్మద్రోణకృపాచార్యులును, నత్యంతంబగు ఖేదంబుం జెందిరి. అంత, విదురుండును, గాంధారియును శోకాక్రాంతులగుచు నతిఘోరంబులగు దుశ్శకునంబు లగుట ధృతరాష్ట్రునకు నెఱింగింపం, బ్రజ్ఞాశాలియగు నతండును దుర్యోధను నుద్దేశించి, 'దురాత్మా! పాండవ ధర్మపత్నియును, బతి

వ్రతాతిలకంబును నగు పాంచాలరాజతనూజ నీసభామధ్యంబున నివ్విధంబున భంగపఱచితివి గాన, నేఁటితోఁడ వినాశంబు నొందితి' వని పలికి, దిగ్గనలేచి, బంధుమధ్యంబు వాసి యొకప్రదేశంబునకుం జని, యంతయును దనమనంబున విచారించుచు ద్రౌపదిం బిలిచి, 'నాకోడండ్రలోన నీవు నిఖిలగుణసమేతవగుట నీవు కోరిన వరంబొసంగెద. వేఁడుమనిన, సద్దేవియును, 'గౌరవోత్తమా! వరం బొసంగెద' నని పలికితిరి. కాన, మిమ్ము నొక్కటి ప్రార్థించెద. మిగుల నభిమాన శాలియును, నుపలాలితుండును నగు ప్రతివింధ్యుని నీకుమారకులు దాసపుత్త్రుండని పిలిచిరేని యతండు దేహంబు దొఱంగు. కావున, సర్వధర్మ విధిజ్ఞుండగు నీయజాతశత్రునకు దాసత్వంబు లేకుండ ననుగ్రహింపవలయు' ననిన వైచిత్రవీర్యుం 'డట్లకాక' యని, 'నీకొక్కవరం బొసంగిన మాత్రంబున నామనంబు సంతుష్టి నొందదు. ఇంకను వలయు వరంబులొసంగెద. వేఁడుమనినఁ బాంచాలి, 'దివ్యకార్ముక హస్తులును, రథారూఢులును నగు భీమార్జున నకుల సహదేవులకును దాసభావంబు దొలంగించుట రెండవ వరంబనిన, నతం 'డదియొసంగితి; నీవు పతివ్రతా శిరోమణి యగుట నీదుకన్నీ రెయ్యెడం బడియె నట్టి గృహంబునకు నాశంబు వాటిల్లుం గావున, నీమనంబునకు సంతసంబుగావింపఁ దలంచినాఁడ. ఇంకను వరంబులు వేఁడు' మనిన నయ్యాజ్ఞసేని యతని నుద్దేశించి, 'నరేంద్రా! వైశ్యులకు నొక్కవరంబును, క్షత్త్రియ కాంతలకు రెండువరంబులును, రాజునకు మూఁడువరంబులును, బ్రాహ్మణులకు నూఱువరంబులును గోరవలయు. మిగుల నాసపడిరేని ధర్మహాని వాటిల్లు. అట్లగుట నాకు నింతియె చాలు ఇఁక, వరంబు వలదు. నావల్లభులు దాసభావంబు వలన విముక్తులైరేని సకలభాగ్యంబులును దమంతనె కలుగు' ననెను.

ఆంధ్రవచనభారతము

[ కలువ వీరరాజు ]

# ఉద్దాలక మహర్షి



తొల్లి, యుద్దాలకుండను మహామునీంద్రుండు యథోక్తంబుగా బ్రహ్మచర్యవ్రతంబు నెఱవేర్చి, కర్కశభాషిణియు, కలహకారిణియుఁ బ్రతికూలాచారయు, ననుదిన కృతాపచారయు నైన చండిక యను దానిఁ బెండ్లి యాడి, బాల్యంబుననుండి యౌవనకాలపర్యంతము నానా విధంబులుగా మనోరంజనంబు సేసియు, దానివలన గుణంబు గానకయే చింతించుచునుండు. వేపచెట్టునకుం బాలుపోసి చక్కెర యెరువువేసి పెంచిననేనియుఁ జేదుగాక మాధుర్యంబు గలుగనేర్చునె? అతండు 'సంధ్యవార్వఁ బాత్రంబు దెమ్ము'నిన, నది రాతిమీఁదఁ బగులఁగొట్టు. దాని నతికించుకొనుట యతిప్రయాసంబగు. 'తడిధోవతి యెత్తియిమ్ము' నిన, నడిమికి రెండుగాఁ జింపు; నది బ్రహ్మకమ్మివైచి కట్టుకోవలయు. 'జపమాలిక దెమ్ము'నిన, సూత్రంబు ద్రెంచి పూసలు వెదచల్లు; నవి వెతకి యేఱితెచ్చుకోవలయు. 'సమిధలు దెమ్ము'నినఁ, గుండంబార్చి వైచు; నదియూఁది, రగులుకొల్పు ప్రయాసంబు దైవంబెఱుంగు. 'వంట వేగంబ కావలె'ననినఁ, గడవలు పగులఁగొట్టు. 'కోపంబువలదే' యనిన, రోఁకలిచేఁ బ్రహరించు.

ఇవ్విధంబునఁ బ్రతిదినంబుఁ బ్రతికూలవర్తనయగు భార్యచేత బడరానిపాటులఁ బడుచు, బ్రహ్మచారియు, గృహస్థుండునుగాక, రెంటికిఁ జెడ్డరేవఁడై వంతం బొందుచున్నయెడ, నతనికి గురుండగు కౌండిన్యుం డను మునివర్యుండు శిష్యులుగొలువఁ, దీర్ఘయాత్ర పోవుచును ద్రోవ వచ్చి, యుద్దాలకుని యాశ్రమంబునకుఁ జనుదెంచుటయు, నతం డర్ఘ్య పాద్యాది విధానంబులఁ బూజించి, కుశలం బడిగి, కౌండిన్యుతోఁ దన

భార్య ప్రతికూల వర్తనంబులెల్ల సవిస్తరంబుగాఁ బలుకరించి, దుఃఖించుటయుఁ, గౌండిన్యుఁ డుద్దాలకునిఁ జూచి, 'యయ్యనపనికి నేమి సేయఁగలవారము? అగ్నిసాక్షికంబుగా వివాహంబైన సతులెటువంటి వారైనను విడుచుటయెట్లు? దీనికొక యుక్తిఁ బలుకరించెద. చేయవలసిన కార్యంబు, చేయవలదనుము. చేయనొల్లని కార్యంబు చేయుమనుము. ఇట్లు చెప్పితివేని యకృత్యంబులు మాని, కృత్యంబులు సేయుచునుండు నీ యభీష్టంబు సిద్ధించు'నని యానతిచ్చెను.

అయ్యుద్దాలకుండు తన పత్నింజూచి, 'మనయింటి నడవలో నెవ్వరో కొందఱు వచ్చియున్నారు. వారల నవ్వలికిఁ బొమ్మని, తీర్థంబు మొదలుగ నీయక దుర్భాషలం దిట్టు'మనిన నాచండి, 'యక్కటా! యిట్లుసేయుదురె?' అని వారలకు నమస్కరించి, తోడ్కొని వచ్చి, శ్రద్ధసోపేతముగా నన్నపానంబు లొసంగి పూజించె. వారలు చనిన యనంతరంబ, యుద్దాలకుండు మఱునాఁడు భార్యం గనుంగొని 'రేపటికిఁ బైతృకంబు నేను జేయంగలవాఁడనుగాను; కాదని చేసితినేనియుఁ గుండగోళకుల, దురాచారుల, వేశ్యాపతుల, బధిరుల, నంధుల, విష్ణుభక్తివర్జితులఁ, బరదారద్రవ్యనిరతుల బ్రాహ్మణార్థంబునకు నియమింతు. ఇంతియకాని, నిన్న మనయింటికి వచ్చినవారు మగుడవచ్చిరేని వారల నియమించువాఁడఁ గాను. పైతృకంబు సేసితినేని యులవలు, చామలు, నారుగలు, కందులు, నలసందెలు, ననుములు, సెనగలుఁ, దమిదలు, జొన్నలు, కంబు, ల్లి, పుచ్చకాయ, ముల్లంగి, సొరకాయ, పిండికూర, నేతిబీఱకాయ, చిట్టికూర, మేడికాయ, చెంచలికూర మొదలైన యభక్ష్య ద్రవ్యంబులు దెచ్చి వడ్డింతు. అదియునుం గాక, తెల్లవాఱిన జామువిూఁద బ్రాహ్మణులం జెప్పుదును గాని, తొలినాఁటి రాత్రియే విజ్ఞాపనంబు సేయువాఁడఁగాను. సాయంకాల సమయంబున రాత్రితోనేనియు నర్చనంబుసేయుదు. కాని, కుతపకాలంబున

నిద్రపోవఁగలవాఁడ. నట్టింటఁ జిట్టుముకయుఁ, దవుడు, మంటిపెంటలు నెలవుదు. ఇంతియకాని గృహంబు నలంకరింప. బ్రాహ్మణుల వస్త్రం బులు దోఁచుకొని దక్షిణలేదు; పొండని యవిశ్వాసంబుగా నాచరింతు' ననిన విని చండి మండిపడి, సదాచార సంపన్నులు, వేదవేదాంగ పారగులు నైన బ్రాహ్మణోత్తముల నాఁటిరాత్రియే నియమించి, గృహంబుఁ, ముంగిలియు, నడవయు, గోమయానులేపనంబు రంగవల్లికలచే శృంగారంబు గావించి, తానును నరుణోదయంబుననె స్నానంబు సేసి, మినుములు, పెసలు, యవలు, గోదుమలు మొదలగు ధాన్యంబులును, దోసకాయ, పనసకాయ, కాఁకరకాయ, యారుదొండకాయ, బలుసుకూర మొదలైన శాకంబులు, నతిరసంబులు, వడలు, దోసె, లిడ్డెనలు మొదలగు ప్రేక్ష్యంబులైన భక్ష్యంబులును గమనీయంబులైన నూతన భాండంబులం దలవరించి, దక్షిణలు హెచ్చువస్త్రంబులు మంచి గంధంబులు సంపాదించి, యుక్తకాలంబున యథావిధిగా శ్రాద్ధంబుఁ జేయించి, మగనికి, నిష్టబాంధవులకు మృష్టాన్నోపేతంబుగా భోజనంబులు పెట్టి, తాంబూలాదు లొసంగి, సంతోషంబు నొందించె.

ఆ సమయంబున సూర్యమండలంబు బింబఫలడంబరవిడంబనంబై, కాంతి కదంబకంబులఁ గన్నుపట్టు, నస్తగిరి శిఖరంబునఁ గనక కలశంబు కరణిఁ బ్రకాశించె.

అప్పు డుద్దాలకుండు భార్యచేసిన యుపచారంబులకు సంతుష్టుండై, మేనుమఱచి తద్విపరీతంబుగాఁ బలుకక, 'పార్వణంబు గొని పోయి గంగాజలంబులో వైవు'మనినఁ గోపించి యాపాఱుత యింటి సమీపంబున నున్న పెంటమీఁద వైచుటయు నుద్దాలకుం డాగ్రహవ్యగ్రుఁడై, కనుఁగొలంకుల నిప్పులుప్పతిలం జూచుచు, 'నిర్భాగ్యురాల! పవిత్రంబులైన పార్వణంబులు పెంటమీఁద వైచి శ్రాద్ధంబు వ్యర్థంబు గావించితివి. ఈ యకృత్యంబు లెన్నాళ్లు సహించం గల

వాఁడ? ఘోరారణ్యంబున గుంటురాయివై 'పెద్దకాలంబు పడియుండు' మని శపియించి, గడగడ వణంకు పడఁతుకఁ జూచి కరుణాకలిత మానసుండై, కొంతకాలంబునకు ధర్మనందనుని యశ్వమేధాశ్వరక్షణార్థంబుగా నర్జునుండు వచ్చు. అతని కరంబు సోఁకినఁ గృతార్థ వయ్యెద'వని శాపమోక్షంబు ననుగ్రహించె.

జైమిని భారతము.

[సముఖము వేంకటకృష్ణప్ప నాయఁడు]



# అశ్వమేధయాగము



౧

ద్రౌపది, శుభముహూర్తంబున హాటకపుట్టికలో నానావిధంబులైన విత్తనంబులు గొనుచు, మురారి యయ్యమ్మ ననువర్తించి పిఱిందిదెస నరుదేర, నానా పృథివీపాలకులు దూరంబున నిలువ, యమనందనుండు నర్వరభూమి శుద్ధిగా నాలు వృషభంబులఁ బూన్చిన బంగరు నాఁగలిఁ గైకొని, మహామునులు మంత్రంబులు పఠించుచు వెంబడిరా, యాగస్థలంబు దున్నె. అంత దీక్షితుండగు ధర్మనందనుని రత్నకుంభసంభృతంబులును, గంధద్రవ్య పరిమళ మిళితంబులును, నానా విశౌషధీ యుక్తంబులు నైన పుణ్యసలిలంబులచేఁ గుంతియు, దేవకియు, యశోదయు, సాదరంబుగా నభిషేకంబు గావించిరి. ఋత్విజులు నెనమన్నూట తొమ్మిది కుందనంపు టిటికలు గరుడాకారంబుగా నమర్చి, యిట్టు లొకటొకటికి నినుమడి సంఖ్యగా గరుడాకారంబున నైదు వేదికలమర్చి, శాస్త్రోక్తంబుగా నిష్టకాచయనంబు సేసి, యష్టద్వార సమన్వితంబు, నష్టాపదేష్టకామయంబును, వివిధ విచిత్రతోరణ ధ్వజాలంకృతంబునుంగా, యాగశాల గట్టించి, బదరీ బిల్వ పలాశ యూపంబు లిరువదియొక్కటి వరుసగా నిలిపి, స్రుక్స్రువంబులు, నులూఖల జుహువు మొదలైన యజ్ఞపాత్రంబు లలంకరించిరి.

౨

వింశతిబ్రహ్మకల్పజీవియైన బకదాల్భ్యుండు బ్రహ్మయు, వేదవేదాంగ రహస్య నిస్సంశయుండైన సాత్యవతేయుం డధ్వర్యువు, వసిష్ఠ వామదేవ రోమశ గాలవ కపిల సుమంత భాగురి భరద్వాజ జమ

దగ్ని రైభ్య కౌండిన్య గౌతములు ఋత్విజులుగా, నారుణి పులహ పుల
స్త్యోపమన్యు విశ్వామిత్ర మధుచ్ఛంద విభాండక ధౌమ్య వాయు
భక్షకుల రక్షోఘ్న మంత్ర పాఠకులుగా నియమించి, ధర్మనందనుండు,
మృగశృంగ ధరుండును, కృష్ణాజినాంబరుండును, కుశాసనాసీనుండునై
యున్న సమయంబునఁ, బరాశర నందనుండు రాజలోకంబు నవలోకించి,
మీరలు కళత్రసమేతంబుగా జాహ్నవీపవిత్రోదకంబుల ధర్మరాజు
నభిషేకింప వలయు ననియె. అంతట ననసూయయు నత్రియు, నరుం
ధతియు వసిష్ఠుండును, రుక్మిణియు శ్రీకృష్ణుండును, హిడింబయు భీమ
సేనుండును, సుభద్రయు నర్జునుండును, మాయావతియుఁ బ్రద్యుమ్నుం
డును, సుపాకన్యయు ననిరుద్ధుండును, బ్రభద్రయు వృషకేతుండును,
బ్రభావతియు యౌవనాశ్వుండును, సునందయు నీలకేతుండును, ధమ్మి
ల్లయు ననుసాల్వుండును మొదలుగాఁగల యఱువది నలువురు దంపతులు
పంచపల్లవసమంచితంబులైన కలశంబులు గొనుచు, మందమందగ
మనంబులం గదలి, ముందట గీతవాద్య నృత్యంబులు మొరయ, గజాధి
రూఢులై విప్రకన్యలు చల్లు మౌక్తికంబులు మెఱయఁ, గుంతీదేవికి
యశోదలం బురస్కరించుకొని యరుగు సమయంబునఁ, గలహాఘటనా
విశారదుండైన నారదుండు సత్యభామాగృహంబునకుఁ జని, పూజలు
గైకొని యిట్లనియె. 'భామామణీ ! మగండు నీదెసఁ గూర్మిగలవాఁడని
మిగుల గర్వించి యుండుదువు. నేఁడు పెద్దతనంబు రుక్మిణీదేవి కిచ్చె.
అది యెట్లనిన, మూర్ధాభిషిక్తులైన క్షత్త్రియోత్తములు పట్టంపు
రాణులతోడఁ గూడఁ జుట్టుముంగొలువ, ఛత్రచామరంబులు మెఱయ,
భ్రాజిష్ణుండైన శ్రీకృష్ణదేవునితోడఁ గూడ రుక్మిణీదేవి కలశాభిషేకంబు
సేయుటకై జాహ్నవికిఁ జనియె. నీ చనవు వ్యర్థంబయ్యె'ననిన సాత్రా
జితి కలహాశనమునిం జూచి, 'యేకాంతంబునందును బ్రాణేశ్వరుండు
నన్ను మఱచునే'యని తన కేళీసౌధంబున నున్న మురారిం జూపిన, సుర

ముని విస్మితుండై, విష్ణుదేవుని వ్యాపకత్వంబుఁ గొని యాడుచు యథే
చ్ఛముగాఁ జనియె.

3

అనంతరంబ, యఱువది నలుగురు దంపతులు కొంగుముళ్లతోడఁ
గూడఁ, గుసుమగంధ బంధుర హేమకుంభసంభరిత గంగాతరంగిణీ పవి
త్రోదకంబులు దెచ్చి, ఋత్విజులు వేదమంత్రంబులు చదువ, హేమ
కటాహంబులఁబోసి, ధర్మతనయున కభిషేక మాచరింపఁ, బూతాత్ముం
డగు నతండు మఖాశ్వంబునకు నభిషేకంబుసేసి, మహామునులనెల్లఁ గన
కాసనంబుల నిడి, గంధ మాల్యాంబర భూషణంబు లర్పించి, యథోక్త
దక్షిణలొసంగి, యయ్యశ్వంబును యూపస్తంభంబునం గట్టిన, దానిని
బాంచాలియుఁ దానును బూజచేసి, వలగొని, యగ్నిశిఖాముఖంబున
గంధర్వలోకంబునకుఁ జనుమనిన నయ్యశ్వంబు మోర యల్లార్చుచుఁ
దన యభిప్రాయంబు నభినయించిన నశ్వహృదయజ్ఞుండైన నకులుండు
ధర్మజునిం జూచి, 'క్రతుఫల ప్రదాయకుండైన శ్రీహరి తన ముఖంబున
నున్నవాఁడు; స్వర్గఫలం బేమిహెచ్చు!' అని యశ్వంబు దెలుపుచున్న
దన శ్రీకృష్ణ సహితంబుగా ఋషులు సంతోషించిరి. అంత నగ్గంధర్వ
రత్నంబును మంత్రంబుల విశసనంబు గావించిన, సౌమ్యుండైన
ధౌమ్యుండు, వాజి దక్షిణ కర్ణంబు మెలివెట్టినఁ బాలువెడలె. భీమసే
నుండు, పురోహితుని యనుమతిని గృపాణంబుగొని యశ్వశీర్షంబు
ఖండించిన, నది తేజోరూపంబున నెగసి, సూర్యునింగలసె. మురహరుండు
నత్తురంగకళేబరంబు విశసనంబుసేసినఁ, దత్తేజంబు శ్రీహరిలోనఁ గలసె.
తన్మాంసరాశి కర్పూరరాశియైన మునులు గనుంగొని, 'కుంతీ తనయా
గ్రణీ! నీ భాగ్యంబునకుఁ గొఱంత యెయ్యది? అపఘనసారంబు ఘన
సారంబయ్యె'నని సన్నుతులుసేయ, నక్కర్పూరంబు ప్రథమాహుతిగా
నాచార్యుండు నింద్రు నుద్దేశించి చేసిన, నయ్యింద్రుండు చేయిచాఁచి

యాహుతిఁ గైకొనియె. అట్లే దేవతలందఱు వేదవ్యాసు లొసంగు నాహుతులు సాకారంబుగా వచ్చి కైకొనిరి. త్రైలోక్యంబును దృప్తిఁ బొందె. పురోడాశప్రాశనంబును, సోమపానంబును జేసి ఋత్విజు లానందించిరి. ధర్మనందనుండు పూర్ణాహుతి గావించి యవభృథస్నానంబు నాచరించె. అయ్యశ్వమేధయాజిని రాజీవాక్షుండు నందంద కౌఁగిటం జేర్చి యభినందించె. అంత ననసూయ మొదలగు వధూజనులు నీరాజనంబులు సేసిరి. అజాతశత్రుండు బకదాల్భ్యునకు రత్నమయ వృషభంబును, వ్యాసునకు సకల భూమండలంబు దక్షిణగా నొసంగిన, నతండు క్రమ్మఱ నాభూమి విక్రయించి, యాధనంబు దీనుల కొసంగె. ఒక్క యరదంబు నొక్క మదగజంబును నూఱు గుఱ్ఱంబులు నూఱు ధేనువులు నాలుగు సోలల ముత్తియంబులు నలువురు సైన్యపతుల నొక్కొక్క ఋత్విజునకు దక్షిణగా నొసంగి, సభాసదులైన ద్విజులకు నపారంబుగా దక్షిణలొసంగి, కోటి స్వర్ణంబులు పది వేల గుఱ్ఱంబులు నూఱేనుంగులు నొక్కవరుస సొమ్ములు, వచ్చిన రాజులకెల్ల వేర్వేఱ నొసంగి, యాదవులకెల్ల నందులకు రెట్టి ప్రత్యేకంబుగా బహుమానంబు సేసి, రుక్మిణీప్రముఖలైన గోపాలదేవుని వనితామణులకు నపరిమిత రత్నభూషణంబు లొసంగి, భీమార్జున మాద్రీపుత్త్రుల మన్నించి, యుధిష్ఠిరుండు నవరత్న ఖచిత సింహాసనంబున శ్రీకృష్ణదేవుని రుక్మిణీ సమేతంబుగా నునిచి, యాతని దివ్య శ్రీ పాదంబులు బంగరు పళ్లెరంబులోఁ బన్నీటఁ గడిగి, తడియొత్తి, గంధ పుష్ప దివ్య భూషణాంబరంబుల నలంకరించి, యయ్యశ్వమేధ క్రతుఫలంబు సమస్తంబును దత్కరంబున ధారవోసె. అప్పుడు పుష్పవృష్టియు, దివ్య దుందుభిధ్వానంబును గలిగె. మఖపూర్తి గనుంగొని దేవతలు, మునులు, రాజర్షులు, మహాపురుషులు హర్షంబునం గొనియాడిరి.

జై మి ని భా ర త ము

[సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు].

# తక్షశిల



బదరికాశ్రమమును గూర్చిన చరిత్రము మనకు బాగుగఁ దెలియకపోయినను నార్యవిద్యకు, క్రీస్తు పూర్వమెన్నియో శతాబ్దముల నుండియుఁ బ్రఖ్యాతినొందియున్న తక్షశిలా విద్యాపీఠమును గూర్చి కొంతవఱకుఁ దెలియవచ్చుచున్నది. ఇది ప్రస్తుతము పశ్చిమోత్తర పరగణాలయందున్న రావల్పిండికి సమీపములో నున్నది. రామాయణ భారతకాలములనుండియు నిది ప్రసిద్ధికెక్కి యుండెననుటకు నిదర్శనములు గలవు. దీనిని శ్రీరామ సోదరుఁడగు భరతుని పుత్త్రుఁడు కట్టించెననియు, నిది సింధు వితస్తానదుల మధ్య నుండెననియు, మహాభారతమునఁ దెలుపఁబడియున్నది. మగధరాజ్యమును బుద్ధుని కాలమున నేలుచుండిన బింబిసారునకును బుద్ధునకుఁగూడ వైద్యముచేసిన జీవకుఁడీ విద్యాపీఠముననే యాత్రేయఋషి యొద్ద విద్య నేర్చికొనెను. ఇతఁడిచ్చటి కళాశాల యందేడు సంవత్సరములు చదివినపిదపఁ బరీక్షయయ్యెనఁట. అందు, తక్షశిలకుఁ జుట్టును బదునేను మైళ్లలోనున్న ప్రదేశమునందుఁగల మొక్కలు, లతలు, గడ్డి, వేళ్లు, చెట్లును వైద్యమున కనుకూలములగు నేయేగుణములఁ గలిగియుండెనో చెప్పవలసియుండెనఁట. జీవకుఁడును నాలుగు దినములా ప్రదేశముల సంచరించి వానినన్నిటిని బరీక్షించి వానివాని గుణములను వర్ణించెనఁట. ఆ ప్రదేశమందలి మూలికలన్నియు వైద్యమున కనుకూలించుననియే యాతఁడు చెప్పియున్నాఁడు. దీనినిబట్టి యాకాలమునఁ బరీక్షలెట్లు జరుపఁబడుచుండెనో తెలియఁగలదు. బుద్ధుఁడును నీవిద్యాపీఠముననే విద్యాస్వీకారముఁ జేసెనని వాడుక కలదు. క్రీ. పూ. మూఁడవ శతాబ్దమున నశోకుని కాలమున నీ విద్యాలయము మిక్కిలి యుచ్ఛదశలో

నుండెను. ఆత్రేయ మతానుయాయి యగు చరకుఁడిచ్చట నుండియే కాయచికిత్సాప్రధానమైన యష్టాంగ వైద్యక విషయములను బోధించెను. అశోకుని కాలమున ననేక దేశములనుండి విద్యలను గళలను నందు ముఖ్యముగా వైద్యము నభ్యసించుటకు రాజపుత్రులు, సామంతులు, బ్రాహ్మణులు, వైశ్యులు నన్నిజాతుల వారును జేరుచుండిరని విన్సెంటు స్మిత్తుగారు వ్రాయుచున్నారు. చంద్రగుప్తుని మంత్రియగు చాణక్యుఁడీ విశ్వవిద్యాలయమునం జదువుకొనినవాఁడే. ఈతని యర్థశాస్త్రము మిక్కిలి ప్రసిద్ధికెక్కి యున్నది. దీనినిబట్టియే యాకాలపు రాజ్యాంగ తంత్రమునుగూర్చి యనేకులు వ్రాయుచున్నారు. మగధ రాజ్యము చిరకాలము నిలిచియుండుట కీతని రాజనీతియే ముఖ్యసాధనమైయుండెను. స్ట్రాబో, ప్లినీ, టోలమీ, డయోనీసయసు నను నిటలీదేశపు పూర్వచరిత్ర కారులందఱు నీ నగరముయొక్క మహోన్నతదశఁగూర్చి వ్రాసియున్నారు. వారికాలమున నదిచాల ధనవంతమై వివిధవిద్యలకును గళలకును నెలవయి విలసిల్లు చుండెను. అపోల్లోని యస్సు, దామిసు నను పాశ్చాత్యులు క్రీ. శ. 45-వ సంవత్సరమున నిచటికి విద్యకొఱకే తెంచియుండినటుల తెలియవచ్చుచున్నది. దీనివలన నలగ్జాండరు మనదేశమునకు రాకపూర్వమునుండియు గ్రీసు, ఇటలీ, పారసీక దేశములనుండి యిచ్చటికి విద్యార్థులు వచ్చుచుండిరట్లూహింపవచ్చును. హిందువులును బరదేశములయందుఁ దమవిజ్ఞానమును వ్యాపింపఁ జేయుచుండిరి. ఒకానొకబ్రాహ్మణుఁడు గ్రీసుదేశమునకేగి హిందువులకు దేహముపై నభిమానములేదనియుఁ, బరలోక జీవనమే శాశ్వతమనియుఁ దెలుపుట కగ్నిలోనికుఱికి దేహత్యాగము చేసెనఁట.

అలగ్జాండరునకుఁ బూర్వమే పాణిన్యాచార్యుల వారీవిద్యాపీఠమున నుండి తమవ్యాకరణ శాస్త్రమును రచించిరి. అలెగ్జాండరు మన దేశముపై దండెత్తి వచ్చినపుడు గ్రీకులు హిందువుల యమనియ

మూదులఁజూచి విస్మయపడసాగిరి. అలెగ్జాండరును నిచటి విద్యల యౌన్నత్యమును గ్రహించి, యిచటి గ్రంథములనే గాక, కొందఱి విద్వాంసులఁగూడఁ దనదేశమునకుఁ బంపించెను. తరువాత నీ దేశము నకు వచ్చిన ఫిలోస్ట్రాటను అనునతఁడు పురుషోత్తమునకును నలెగ్జాం డరునకును జరిగిన యుద్ధమును దెలియఁజేయు శిల్పమునుగూర్చి యెక్కువగా వ్రాసియున్నాఁడు.

ఫాహియాను కాలమున ననఁగా క్రీ. శ. ఐదవశతాబ్దమున నిచట బౌద్ధవిద్య ప్రబలముగా నుండియుండెను. హూనుత్సాంగు కాలము నకు బౌద్ధమతమిచట క్షీణించియుండెను. ఇచటిస్తూపములును సంఘా రామములును శిథిలము లయ్యెననియు, నడవులు బలిసియుండెననియు, నొక్క సంఘారామమున మాత్రమప్పటికిఁ గొందఱుభిక్షువులు వసించి యుండిరనియు, నీ చీనాయాత్రికుఁడు వ్రాసియున్నాఁడు. ఇచటనున్న యొకస్తూపమున కంధులకు దృష్టిని ప్రసాదించు మాహాత్మ్య మున్న దని యచటివారు చెప్పుకొనుమాటల నీతఁడు తన గ్రంథమునఁ దెలిపి యున్నాఁడు. దానికట్టి మాహాత్మ్యముగలుగుట కచటివారు చెప్పికొను కథ నొకదాని నితఁడు చెప్పియుండెను. అది మన సారంగధర చరి త్రకుఁ గొంచెము దగ్గఱగా నుండుటచే దానినిచ్చట చెప్పుట యుక్తము.

ఆనాఁటి రాజున కిరువురు భార్యలుండిరి. కూరాల యను నాతఁడు పట్టమహిషి కొడుకు. అతఁడు రూపవంతుఁడును, సౌశీల్యాది గుణములచే నొప్పువాఁడునునై యుండెను. పట్టమహిషి మృతినొం దఁగా రెండవ భార్య పట్టమహిషి యయ్యెను. ఈమె జారిణియై యుండి రాజకుమారునిఁ దనతోఁ గలియుమని వేఁడికొనఁగా, నాతఁడు కన్నుల నీరు నించుకొని, పినతల్లియయినను దల్లితో సమానయనియును, నామె కట్టి గుణములు తగవనియుఁ, దానట్టి పాతకమున కొడిగట్టుకొనననియు మొదలించి పంపివైచెను. ఆమెయు నిరాకృతనై తిఁగదా యని క్రోధ

ద్వేషములు మనమునఁ బెనఁగొన నాతనిపైఁ బగ సాధింపనెంచి కుటిల స్వభావయయి యొకనాఁడు రాజుతో, 'నీ పుత్త్రుఁడు మంచి యోగ్యుఁడు; సుశీలుఁడు. మన రాజ్యాంతమునం దల్లరులు జరుగు చుండునేమో? అతని నచటికిఁ బంపి శాంతి నెలకొల్పించుట యుక్తము గదా!' యన నాతఁడును నది మంచి యాలోచనయే యని తలంచి, కుమారునిఁ జేరఁబిలిచి, యాతనికి రాజధర్మముల బోధించి, యాదేశ ములఁ బరిపాలింప నియోగించెను. రాజపుత్త్రుఁడును 'వల్లె' యని తన భార్యతో నా ప్రదేశమున కేగి, యే క్షోభమును బుట్టకుండ, ధర్మముఁ దప్పక ప్రజా పరిపాలనముఁ జేయుచుండెను. ఆటవిక జాతులవారి చేతు లలోఁబడి యాతఁడు మృతినొందునని తలంచిన యాతని పినతల్లి యాతఁ డచట సుఖముగ నున్నాఁడని యెఱిఁగి, యాతని నెట్లు చంపవలయునని యాలోచించుచు, నృపునాజ్ఞ లేనిదే యెవ్వరును నాతని జోలి పోరని రాజు నిద్రించు సమయమున నొక యుత్తరము వ్రాసి, రాజు పంటితో ముద్రవైచి యొక సేవకునివలన దానిని రాజపుత్త్రుని మంత్రులయొద్ద కంపెను. రాజు, ముద్ర నెప్పుడును దన పంటితోడనే వైచుచుండుట యెఱింగిన యామంత్రు లా యుత్తరమును జదువుసరి కందు, 'రాజ కుమారుని కన్నుల నూడఁబెఱికి, భార్యా సహితముగ నాతని నడవు లలో విడిచిపెట్టి, యే యాహారమునీయక యచటనే మడియఁజేయవలె ననియు, నాతఁడొక్క ఘోరమగు కృత్యము నాచరించుటచే నీ దండన యాతనికి విధింపఁబడె'ననియు వ్రాయఁబడియున్న యాజ్ఞం జదివికొని, యేమియుఁ దోఁచక, విచారములో మునింగి యుండుటఁ జూచి, రాజ కుమారుఁడు, వారి విచారమునకుఁ గారణమడుగ, నుత్తరములోనున్న యాజ్ఞ నాతని కెఱింగించి, 'యిది యసంభవము. రాజిట్టి యాజ్ఞ నిచ్చియుండఁడు. ఇందేదో ద్రోహమున్నది. తిరిగి రాజు నడిగి కాని, యాతని యాజ్ఞ ననుసరింప'మని చెప్పిరి. రాజకుమారుఁడు, 'రాజాజ్ఞ

యెట్టిదైనను ననుసరింపవలసినదే. ఆతని పంటిముద్ర యున్నదిగదా సందేహింపనేల ?' యని పలికి యొక చండాలునిఁ బిలిపించి కన్నూలూడఁ బెఱికించుకొని, భార్యతోఁ గూడ నడవుల సంచరించుచు నాఁకలి కోర్వలేక, యొకనాఁడు తండ్రి రాజధానిం జేరి, తనవలన నేరములేదని రాజునకుఁ దెలుపుటకై యొక 'చితారు' చేతఁబట్టి, దీనముగ గానముఁజేయుచుఁ దనవృత్తాంతమును వెలిపుచ్చుచుండెను. ఆమనోహరగానము రాజుచెవిఁ బడగానే యాపాడుచున్న యాతఁడు తనపుత్త్రిుఁడేయగునని గ్రహించి, వెంటనే తనమోలకుఁ బిలిపించి, యంధుఁడైయున్న తనకుమారుని గౌఁగిలించుకొని, 'నాయనా ! నీ కిట్టి యపకారము నెవరు చేసిరోయి ! అయ్యో ! నాకుమారుఁడు తన ప్రజలను జూడఁజాలని యవస్థనున్నాఁడే ! అయ్యో !' యని విలపించుచు నిట్టియాపదఁ దెచ్చిపెట్టినది తన భార్యయే యని తెలియఁగా నామెకు శిరశ్ఛేదము చేయించెను.

ఆకాలమున సంఘారామమునఁ బ్రదివిద్యలను నేర్చి ప్రఖ్యాతికెక్కియుండిన ఘోషుఁడను నొకసిద్ధుఁడుండెను. రాజు తనపుత్త్రి నాతని మోలకుఁ దీసికొనిపోయి, 'నాకుమారునకు నేత్రదానముఁజేయు' మని వేడికొనఁగా నాతఁడును ననుగ్రహించి, 'రాజా ! నీ దేశము నందలి ప్రజలనందఱి నిటకురాఁబంపుము. వారితో నొక్కొక్కరును నొకపాత్రను తీసికొని రావలయును' అని చెప్పఁగా నట్లే ప్రజలందఱును నాసంఘారామమునఁ జేరిరి. అప్పుడు సిద్ధుఁడు బౌద్ధధర్మముల బోధింపఁ దొడఁగెను. ఆ యుపన్యాసమును విని వారందఱును గన్నీరు విడువసాగిరి. ఆ కన్నీటిని తమతమ పాత్రలలో సేకరింపుఁడని చెప్పి, సిద్ధుఁడు పెద్దపాత్రలోఁ బోసి, 'బుద్ధుని ధర్మములు మంచివికాక పోయినచో నీతని నేత్రములట్లే గ్రుడ్డివియైయుండును. అవియే సత్యములైనచో నీ కన్నీటి స్పర్శవలన నీతనికి దృష్టితిరిగి వచ్చునుగాక !' యనుచు నాతని కన్నులను దుడువఁగా నాతనికి దృష్టి యథాప్రకారముగా వచ్చెను.

సారంగధరుని కథను మూలమెచ్చటిదో యిప్పటికిని తేలలేదు. ఇప్పటికిని, పంజాబు దేశములో నిట్టికథను జెప్పికొనుచున్నారు. చేమకూర వేంకటకవి సారంగధరుని తండ్రి † మాళవదేశాధిపతియని చెప్పియున్నాఁడు. మనమీకథను రాజమహేంద్రవరమున కంటఁగట్టుచున్నాము. ఇట్టికథలు సాధారణముగ నొక ప్రదేశమునఁబుట్టి నానాఁటికి వైలక్షణ్యముఁబొందుచు నన్ని దేశములందును వ్యాపించుచుండును.

ప్రాచీన విద్యాపీఠములు,

[డాక్టర్, చిలుకూరి నారాయణరావు పంతులుగారు
ఎమ్, ఏ., పి. హెచ్. డి.]

---

† మాళవ దేశమునకుఁదొలుత ఉజ్జయినియు, నాపల ధారాపురియు రాజధానులుగా నుండెను. దీనినే విదర్భదేశమనియుఁ జెప్పుదురు. [పు. నా. చం.]

# వేంగి



వేంగియను పదము వ్యాఘ్రశబ్ద భవమనియుఁ, బౌద్ధపులులు సంచరించు మహారణ్య ప్రదేశమగుటచే వేఁగీదేశమున కానామము గలిగినదనియుఁ గొందఱనుచున్నారు. 'దగ్ధమగు' అను నర్థముగల 'వేఁగు'ధాతువునుండి యిది పుట్టెననియు, నెవ్వరో దీనిని దగులఁబెట్టుటచే దగ్ధరాష్ట్రమను నర్థముగల వేఁగి యను పదముత్పన్నమయ్యెననియు మఱికొందఱనుచున్నారు. వేగు, అనఁగా నుదయించుననునర్థముగల ధాతువునుండి వేగి శబ్దము పుట్టినదనియు, జపానుదేశమునకు సూర్యోఁడుదయించు దేశమను నామమున్నట్లే దీనికిని నాపేరు గలిగినదనియు, మిక్కిలి తూర్పుగానున్న రాజ్యమగుటచే దీనికానామము తగియున్నదనియు నింకఁ గొందఱనుచున్నారు. మఱికొంద ఱీదేశమున వేగులవాండ్రు హెచ్చుగ నుండుటచే నాపేరు గలిగినదని చెప్పుచున్నారు. శబ్దములవ్యుత్పత్తినిబట్టి చారిత్రకాంశముల నిర్ణయింపఁబూనుట సాహసము. క్రీస్తు పూర్వమునుండియు వేంగిరాష్ట్రము సుప్రసిద్ధమై యుండఁగా, నిది యెన్నఁడు వ్యాఘ్రముల కాలవాలమై యుండెనో, యెవరు దీనిని దగులఁబెట్టిరో, వేగులవాం డ్రీ దేశముననే యెక్కువగా నేల యుండవలెనో, యెప్పుడుండిరో మొదలగు విషయములు తెలిసినఁ గాని యిట్టి శబ్దశాస్త్ర పాండిత్యముపై నాధారపడుట కొంత వినోదముగా నుండవచ్చును గాని, సత్యనిర్ణయమునకుఁ దోడ్పడదు.

రాజమహేంద్రవరము వేఁగిదేశమునకుఁ జాళుక్యులకాలములో రాజధాని యయ్యెఁగాని, యాంధ్రులకాలమున ధాన్యకటకమును, వేంగియు రాజధానులుగా నుండెను. కృష్ణామండలములోని యేలూరు

నకు సమీపములోనున్న పెదవేఁగి యను గ్రామమే పూర్వకాలపు వేంగి యని యనేకులు తలంచుచున్నారు. ఈ గ్రామమునకు సమీపముననే గుంటుపల్లియొద్ద ఱాతిదేవాలయములును, బాడుపడిన కొన్ని కట్టడములును గానవచ్చుచున్నవి. ఇచట నప్పుడప్పుడు భూమిలోనుండి తామ్రశాసనములును, నాణెములును బయలు వెడలుచుండునఁట. ఇప్పుడది కుగ్రామముగా మాఱినను బూర్వకాలమున నా సమీపమున గొప్ప పట్టణమొకటి యుండియుండును.

హాయనుత్సాంగిచటికి వచ్చినప్పుడు భూమి సారవంతమై, సస్యసమృద్ధమై యుండెను. ధాన్యకటకమువలె నిదియు నుష్ణప్రదేశమై యుండెను. జనులు తొందరపాటువారై యుండిరి. ఇచటి వారి భాష మధ్యదేశమువారి భాషకంటె భిన్నముగా నుండెను. ఆ భాషయందలి వాక్యములలోని పదముల కూర్పుకూడ భిన్నమే. ఇచటి వారుపయోగించు నక్షరములు గూడ మధ్యదేశము వారుపయోగించునవి కావు. ఇక్కడ నిరువది సంఘారామములును, మూఁడువేలమంది భిక్షువులును నుండిరి. ముప్పది బ్రాహ్మణ దేవాలయములును నిచట నుండెను. బ్రాహ్మణమతస్థులు బౌద్ధులతోఁ గలిసి వర్తించుచుండిరి.

వేంగి కనతి దూరముననే యొక సంఘారామముండెను. ఇందంతస్థులుగల హర్మ్యములును, సొగసుగఁ జెక్కఁబడిన స్తంభములచే నలంకరింపఁబడిన యితర గృహములు నుండెను. ఇచటి బుద్ధవిగ్రహమును శిల్పి తన నేర్పంతయుఁ జూపి కళలూరునట్లు చెక్కియున్నాఁడు. ఈ యారామము ప్రోల నూఱడుగుల యెత్తుగల యొక స్తూపమున్నది. దీనిని, విగ్రహములను గూడ నచలుఁడను వాఁడు నిర్మించెను.

సంఘారామమునకు దగ్గఱగనే యున్న మఱియొక స్తూపము నశోకరాజు కట్టించెను. పూర్వకాలమున తథాగతుఁడిచట వాసముచేసి, యనేకులను బౌద్ధమతములోనికిఁ ద్రిప్పెను.

ఈ సంఘారామమునకు దగ్గఱగనే యొక శిలాస్తూపముండెను. ఇచట † జినబోధిసత్త్వుఁడు 'న్యాయద్వార తారకశాస్త్ర'మను పేర * హేతు విద్యాశాస్త్రమును రచించెను. బుద్ధుని యనంతర మీబోధి సత్త్వుఁడామతము నవలంబించి శ్రమణకుఁడై, కాషాయవస్త్రముల ధరించి, మిగుల జ్ఞానమును సంపాదించెను. ఈతఁడు మహా తపస్సంప న్నుఁడై నిరాధారముగ నున్న లోకముపైఁ గరుణగలిగి, బౌద్ధధర్మ ముల వ్యాపింపఁజేయ సమకట్టెను. హేతు విద్యాశాస్త్ర మగాధమై, బహు శ్రమచేతఁగాని దాని యర్థము సుసాధ్యము కాకపోవుటచే నది ముక్తికి సులభమార్గము కాకుండుటఁ గాంచి, యాతఁడు పర్వత గుహాలం జొచ్చి, చాలకాలము ధ్యానపరుఁడై సమాధిలోనుండి, తొలుత తథాగతుఁడు ప్రచారముచేసిన యాశాస్త్రము విస్పష్టముగా నుండినను, నాతని యనంతర మది దురవబోధమగుటచే దానిని బాగుగ బోధపడునట్లు చేసికొని, యావిజ్ఞానమువలన జన్మరాహిత్యమును బడయ నెంచెను. కాని, యాతఁడొక్కఁడే యట్టిముక్తిఁ బడయుటవలన లోక మున కేమి యుపకారము? తానొక్కఁడే నిర్వాణము నొందఁగా నితరు లజ్ఞానాంధ కారమునందుండి, సంసారబంధములఁ దగుల్కొని తిరుగాడ వలసినదేనా? అందుచేత మంజుశ్రీబోధిసత్త్వుఁ డాతనిమ్రోల సాక్షా త్కరించి, యతఁడు గ్రహించిన నిర్మలజ్ఞానమును లోకమునకు బోధింప నియోగించెను. జినబోధిసత్త్వుఁడును నాతని యాజ్ఞను శిరసావహించి, యా న్యాయశాస్త్రమునే కాక యోగశాస్త్రమును గూడ శిష్యవర్గ మునకు బోధించెను.

---

† 'చీనాభాషలోని యీతని నామమును 'జిన' యని పాశ్చాత్యులనువదించి రనియు, దానికి సరియైన యనువాదము దిఙ్నాగుఁ డనియు సతీశచంద్ర విద్యాభూష ణులవారు చెప్పుచున్నారు.'

* ప్రతివిషయమునకును హేతువును జూపియే చెప్పవలయునని నెడి శాస్త్రము.

వేఁగి యేకాలమునుండి క్షీణదశ నొందుచువచ్చెనో మనకుఁ దెలియదు. క్రీ. శ. 226-వ సంవత్సరములో నాల్గవ పులమాయితో నాంధ్రరాజుల వంశ మంతరించిపోయినది. అప్పటినుండి 550 సంవత్సరములవఱకును నీదేశపుఁ జరిత్ర యంతగాఁ దెలియకున్నది. పురాణములఁబట్టి యనంతరము యవనులును, శకులును నీదేశమును బాలించిరను మాటయేగాని యంతకంటె విశేషములెవ్వియుఁ దెలియరాలేదు. చాళుక్యులీదేశము నాక్రమించిన నాఁటినుండియుఁ జరిత్రము కొంత తెలియుచున్నది. ఆకాలమున బౌద్ధమతము క్షీణించుచున్నను వారి సంఘారామములందు విద్య సాగుచునేయుండెను. కాని, బౌద్ధమతాచారములలోఁ గొన్నిఁటిని బ్రాహ్మణులును, బ్రాహ్మణమతాచారములను బౌద్ధులును నవలంబించుచుండుటచే నారెండుమతములు నొక దానిలోని కొకటి సంక్రమించుచు వచ్చెను.

వేఁగిదేశమున జైనమతమును జాలకాలము వ్యాపించియుండెను. చాళుక్యరాజులతోఁ గూడ నిచటికిఁ గర్ణాటులు వచ్చియుండిరి. ఈ కర్ణాటులలోఁ గొందఱీదేశముననే కన్నడ కావ్యముల రచించియుండిరి. 941-వ సంవత్సరప్రాంతమున భారతమును, నాది పురాణమును వ్రాసిన కన్నడకవియగు నాదిపంప తన పూర్వులు వేఁగి మండలమున వేఁగిపళువను భాగమునకుఁ జేరిన వసంత, కొట్టూరు, నిడుగొంది, విక్రమపురము నను నగ్రహారములం దగ్రగణ్యులై యుండిరని చెప్పికొని యున్నాఁడు. శాంతి పురాణము, జీవాక్షరమాల యను గ్రంథములను 950 సంవత్సర ప్రాంతమున రచించిన పొన్నయనుకవి వేంగీ విషయము నందలి కమ్మనాడులోని పుంగనూరను గ్రామములో నుండిన నాగమయ్య యను వాని పుత్త్రులగు మల్లప, పున్నిమయ్య యను వారి కోరికపై శాంతిపురాణమును రచించితినని చెప్పికొనెను 990 సంవత్సరప్రాంతమున ఛందోంబుధి, కర్ణాటక కాదంబరి, యను గ్రంథము

లను వ్రాసిన మొదటి నాగవర్మ తాత, తండ్రి వేంగి మండలములోని వేంగి పళువులో నుండెను.

జైనమత మీదేశమున వ్యాపించుచుండఁగా, బ్రాహ్మణమతమునకుఁగలుగునను భయముచేతనో, జైన వాఙ్మయాభివృద్ధిఁ జూచి యాంధ్రభాషయందు బ్రాహ్మణమత గ్రంథముల రచియింపవలయునను నుద్దేశముతోడనో, చాళుక్యరాజు లాంధ్రమున గ్రంథముల వ్రాయింపఁ బ్రయత్నములు సలుపుచుండి యుండవచ్చును. కాని, యట్టి గట్టి ప్రయత్నము రాజమహేంద్రవరమునఁ బదునొకండవ శతాబ్దమున రాజరాజు నాస్థానమునఁ గాని జరిగియుండలేదు.

ప్రాచీన విద్యాపీఠములు.

డాక్టర్, చిలుకూరి నారాయణరావు పంతులుగారు,
[ఎమ్. ఏ., పి. హెచ్. డి.]



శ్రీ ర స్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# లఘుటిప్పణము



## శ్రీమదాంధ్ర మహాభారతము - ఆదిపర్వము

# ఏకలవ్యుని గురుభక్తి

కవిజీవితము :

ప్రకృత కథాంశమును నన్నయభట్టారకుఁడు రచియించెను. ఇతఁడు స్మార్త బ్రాహ్మణుఁడు; ముద్గల గోత్రుఁడు. ఈతఁడు వేఁగి దేశాధిపతియైన రాజరాజ నరేంద్రుని యాస్థానకవి. ఆ భూమీశుఁడు క్రీ. శ. 1022—1063 వఱకు రాజ్యపాలన మొనర్చెను. కావున, నన్నయ భట్టారకుఁడు తదాస్థాన కవి యగుటచే నాకాలమున నుండినవాఁడు.

ఈ మహాకవి యయిదవవేద మనంబరఁగు సంస్కృత మహాభారత గ్రంథమును రాజనరేంద్రుని ప్రేరణముచే నాంధ్రీకరింపఁగోరి, యందలి యాదిపర్వమును, సభాపర్వమును, అరణ్య పర్వములోని నాలవ యాశ్వాసము మూఁడవ వంతువఱకును రచియించి, రాజనరేంద్రుని కంకిత మొనర్చెను. భారతరచనా సందర్భమున నీతనికి నారాయణ భట్టు సాహాయ్య మొనర్చెనఁట.

కవిత్రయమనఁ బరఁగు మహాకవులలో నన్నయ్య మొదటివాఁడు. ఇతనికి 'శబ్దానుశాసనుఁ'డను బిరుదము గలదు. నన్నయ్య పైఁజేర్కొనఁబడిన భారత భాగమును గాక, యాంధ్రశబ్ద చింతామణి, యింద్రవిజయము, లక్షణసారమను గ్రంథములను గూడ రచియించినట్లు చెప్పుకొనెదరు. ఈతని కవనము రెండు వంతులు సంస్కృత పదములును, నొకవంతు తెలుఁగు పదములును గలిగి, జాతీయమై, యలంకార శోభితమై, నాతి కఠినమై, సరళమై యొప్పుచున్నది.

ఏకలవ్యుఁడు—హిరణ్య ధన్వుండను బోయలఱేని కొడుకు.

టిప్పణము :

1. నరుఁడు = అర్జునుఁడు. పరిణతి = పరిపాకము. శశ్వత్ = ఎల్లప్పుడు. భారద్వాజుఁడు = ద్రోణాచార్యుఁడు. అప. తద్ధి. 2. అభియోగము = పూనిక. ధనుః+ధరులు = ధనుర్ధరులు = విలుకాండ్రు. ద్వంద్వ సంకీర్ణ యుద్ధముల తెఱఁగు = ఒకరితో నొకరు చేయు యుద్ధములయొక్కయు, దొమ్మి యుద్ధములయొక్కయు రీతి. ద్వంద్వము (నానా) స్త్రీ పురుషుల జత, శీతోష్ణాదులు. గదము (ప్రకృ) అగదము (వికృ) వాజి=గుఱ్ఱము. వ్యు. వేగముగలది. (నానా) పక్షి, బాణము. వారణము=ఏనుఁగు. వ్యు. పరబలము నడ్డపెట్టునది. వ్యూహము = మొగ్గరము. భార్గవుఁడు=పరశురాముఁడు, 3. ప్రాసము = ఈఁటె. తోమరము = చిల్లకోల. జితశ్రములు = జయింపఁబడిన యాయాసము గలవారు. ఎఱుకు = కిరాతుఁడు. నిషాదపుత్రుఁడు = బోయవాని కొడుకు. ద్రోణు+అనుజ్ఞ = ద్రోణుననుజ్ఞ. సూ. షష్ఠీ సమాసమునందు ఉకార ఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు. 4. అర్థిన్=ఆశతో. 5. మృగయాలంపటులు= వేఁటయందాసక్తిగలవారు. వనము (నానా) అడవి, జలము, ఇల్లు. సారమేయము = కుక్క, సరమ సంతానము, నివహము = సమూహము. నిహవము = పిలుచుట. 6. ఏకతంబ = ఒంటరిగానే. ఏడు = ఆఱు నొకటి. (భిన్నా) ఏఁడు = సంవత్సరము. అతిలాఘవము=మిక్కిలి సులువు. లాఘవము (నానా) ఆరోగ్యము, అవమానము. శరపూరిత ముఖంబయి = బాణములతో నిండిన ముఖముగలదై. శరము (నానా) బాణము రెల్లు, జలము. విస్మయము = ఆశ్చర్యము. వికృ. విసుమయము. రోయుచు=వెదకుచు. 7. తేజిత = వాఁడి చేయఁబడిన. మలీమసకృష్ణ దేహుఁడు = మురికితోఁగూడిన నల్లని శరీరముగలవాఁడు. బ. సమా. అస్త్రవిషయాప్త విషాదుఁడు = అస్త్రములనెడి విషయమునందుఁ బొందఁబడిన వ్యసనముగలవాఁడు (అనఁగా నింకను బహువిధములయిన యస్త్రముల జ్ఞానము గలుగవలయునని సంతతము కోరువాఁడు). పరస్పర వక్త్రవిలోకన క్రియావ్యాజము = ఒండొరుల మోములను జూచుకొనుటయను మిష. మత్సరము, (ప్రకృ). మచ్చరము. వికృ. 9. వనచర నాథుకొడుకన్ = బోయరాజు కొడుకను. అనవద్యుఁడు = దోషములు లేనివాఁడు. 11. అగ్గలము=అధికము. త్రిలోకములు = స్వర్గ మర్త్య పాతాళములు. 12. కౌశలము=నేర్పరితనము. భా. తద్ధి. అమిథ్యావచనా!= సత్యవచనములు గలవాఁడా! 13. అనవరత = ఎల్లప్పుడు. నిరతుండు = మిక్కిలి యాసక్తిఁగొన్నవాఁడు. ఆరాధించి = పూజించి. కరకమలంబులు. ఉపమిత సమా. 14. పరిజనము = పరివారము. అమోఘము = వ్యర్థముగానిది 15. నెమ్మిని = సంతోషముతో. పెనువ్రేలు = పెద్దవ్రేలు (బొటనవ్రేలు) అనుదున్, నావుదున్. 16. దక్షి

దాంగుష్ఠము = కుడిచేతి బొటనవ్రేలు. సంధానము = బాణమును వింటినారియందుఁ గూర్చుట. పార్థుఁడు = అర్జునుఁడు. అప. తద్ధి. మనః+రుజ=మనోవ్యాధి. 17. బలరిపుసుతుఁడు = అర్జునుఁడు (బలుఁడను రక్కసుని సంహరించుటచే నింద్రునకు బలసూదనుఁడు; బలారాతి, బలారి, బలరిపు వను నామాంతరములు గలిగెను.)

---

శ్రీమదాంధ్రమహాభారతము

ఉద్యోగ పర్వము — ద్వితీయాశ్వాసము

# విదుర నీతి

**కవిజీవితము :**

ఈ కథాభాగమును రచియించినది తిక్కన సోమయాజి. ఇతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; గౌతమ గోత్రుఁడు; అన్నమాంబా కొమ్మనామాత్యులకుఁ బుత్త్రిఁడు.

ఈతని వాసస్థలము నెల్లూరు (సింహపురి) మండలమునకుఁ జేరిన పాటూరు. ఆకాలమున నెల్లూరు మండలమును బాలించుచుండిన మనుమ సిద్ధి రాజునొద్ద నీతఁడు మంత్రిగాను, నాస్థాన కవిగాను నుండెను. ఈమహాకవి 13-వ శతాబ్ది ప్రారంభమందుండిన వాఁడు.

ఈతఁడు కవిత్రయమున రెండవవాఁడు. భారతమును దెనిఁగించుటకు మున్ను నిర్వచనోత్తరరామాయణ మను కావ్యమును రచియించి, మనుమసిద్ధి కంకిత మొనర్చెను. ఇతఁడు భారతమునందు విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వము వఱకుఁగల పదునైదు పర్వములను రచియించి, హరిహరనాథున కంకిత మొసఁగెను. విజయసేనమను మఱియొక గ్రంథమును గూడ రచియించినట్లు చెప్పెదరు. ఇతనికిఁ గవిబ్రహ్మయను బిరుదము గలదు. కవిత్వము మృదుమధురమై, ద్రాక్షా పాకమున నొప్పుచుండును. వ్యర్థపదములు గగన కుసుమములు. ఈతని కవిత్వమున రెండు వంతులు తెలుఁగు పదములును, నొకవంతు సంస్కృత పదములును నొప్పుచుండును.

**విదురుఁడు :**

ధృతరాష్ట్రుని మంత్రి. వ్యాసానుగ్రహమున నంబికయొక్క దాసియందు జనించిన వాఁడు. యముఁడు మాండవ్యుని శాపవశంబున భువియందు శూద్రుఁడై

పుట్టెను. అతఁడే విదురుఁడు. ధర్మాత్ముఁడు, నీతివేత్త. పాండవుల కెగ్గుసేయుచుండు నట్టితఁడు పెక్కుమాఱులు ధృతరాష్ట్రునకు హితోపదేశ మొనర్చెను.

టిప్పణము :

1. నెవ్వగ (నెఱ+వగ) = నిండు దుఃఖము. చిత్తవృత్తి=మనోవ్యాపారము. చొప్పడదు=కుదురుపడదు. 3. కోలుపడిన=పోఁగొట్టుకొనిన. ముచ్చిలన్=దొంగిలింపఁగా. ఆకులచిత్తుఁడు=వ్యాకులతనొందిన మనస్సుగలవాఁడు. 4. కొఱగాములు=చెడుగుణములు. ఎక్కటి = ఒక్కఁడవు. కుడువఁదలంచితి+ఒ=అనుభవింపనెంచితివా ? 5. ధృతరాష్ట్రుఁడు. వ్యు. ధరింపఁబడిన రాష్ట్రముఁ గలవాఁడు. అలమట = దిగులు. మలుఁగఁజేయన్ = పోఁగొట్టుటకు. 6. ప్రెగ్గడ = మంత్రి. రూ. ప్రెగడ ప్రకటీకృత సత్యుఁడు = వెల్లడిచేయఁబడిన సత్యము గలవాఁడు. మూర్తి (నానా) శరీరము, కాఠిన్యము, ప్రతిమ. శీలము =మంచినడత. (నానా) స్వభావము. విశ్రుతుఁడు = ప్రసిద్ధికెక్కినవాఁడు. 7. నెఱిలేక = న్యాయములేక. పఱిచితిరి = బాధపెట్టితిరి. పిల్లిపట్టిన యీలువు చేసియున్నన్=పిల్లి పట్టిన వ్రతమును జేసియున్నంత మాత్రమున. 9. తారు (రూ) తాము, తమరు. తాలిమి = ఓర్పు. విడుపు గలుగుటయున్ = అయుక్తముల విడుచుటయు. సుమానుషములు = మానవుల కుండవలసిన మంచి గుణములు. 10. యుధిష్ఠిరుఁడు (యుధి+స్థిరుఁడు) = ధర్మరాజు వ్యు. యుద్ధమునందు స్థిరమైనవాఁడు. తగవు = న్యాయము. ఎఱుంగుదు - ఎఱుంగుదువు. సూ. లిడ్డాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. 11. ఎల్లి = రేపు. తెఱఁగు=ఉపాయము. హితము (విక్ప) హితవు, ఇతవు. డిందు పఱుపు = పోఁగొట్టుము. 12. ప్రజాగరం బొనర్చు= నిదురపట్టకుండఁ జేయు. వచనామృతంబు. రూ. సమా. వెల్లిగొల్పుము = ప్రవహింపఁ జేయుము. 13. ఒడఁబాటు = సమ్మతి. ఉడుగుచున్ = మానుచు. ఉలుకక=అసూయపడక. 14. ఉబ్బును = పొంగును. ఆపోవక యునికియును = తృప్తినొందక యుండుటయును. నిర్వ్యాపారత్వమున్ = పనిలేక యుండుటయును. కాపురుష గుణంబులు= కుత్సిత పురుషుని గుణములు. 15. ... సంశీలతన్ = మంచిస్వభావము కలుగుటతో. పాలసుఁడు = దుర్జనుఁడు. 16. నెమ్మి=ప్రీతి. వెనుకఁదగులుదురు = అనుసరింతురు. ఇమ్ము = ఉపాయము. 17. వంశము (నానా) కులము, వెదురు, పిల్లంగ్రోవి. పొనరించును = కలుగఁజేయును. 18. అరిది=అశక్యము. ఉజ్జ్వలశరము=మండుచుండు బాణము. శరము (నానా) బాణము, ఱెల్లు, జలము. నతి స్ఫురణము=నీతియొక్క ప్రకాశము. 20. తెరువు=దారి. 21. మున్నీటిన్ (మును+నీటిన్) = సముద్రమును. కడవం బెట్టఁగన్ = దాఁటించుటకు. కరణి=విధము కరిణి=ఆఁడేనుఁగు. 22. చాలమి వెట్టుదురు = అశక్తి నారోపింతురు, అనూనక్షమ=తక్కువగాని యోర్పు. తోడవు=

భూషణము. తాల్తురు - తాలుచుదురు. సూ. చువర్గంబుతోడ దగ్ధకారంబు తకారం బగు. 23. తొలఁగుట=విడుచుట. 24. సైరణ=ఓర్పు. అర్థికిన్=యాచకునకు. ఇచ్చునతండు - ఉదంత తద్ధర్మార్థక సంధి. 25. పాడి=న్యాయము. పాఁడి=క్షీరదధ్యాది సమృద్ధి. ఈగి=ఈవి. నెట్టన=తప్పక. రూ. నెట్టనము. 26. పలుకు ప్రల్లదంబు=పరుషమయిన మాట. 27. పథము=న్యాయమార్గము. 28. త్రోపుఁబాడియు=పరాభవము. 30. ఉడుపుచున్ = పోఁగొట్టుచు. 31. మానిసులంజేసి = పెద్దవారినిఁగాఁజేసి. వెలినుండఁగన్ = రాజ్యము తొలఁగియుండఁగా. వెడవెడ=సూక్ష్మముగ. 32. చిత్తతాప+ఉపశమముగాఁగన్=మనస్సునందలి యారాటము తీఱునట్లుగ. 33. అవధానంబుతోడన్ = పరాకుతో 34. దక్కను (రూ) దక్కను. లోలతన్=ఆశతో. ఆమిషంబు=మాంసము. వ్య. రోగముతు గలిగించునది. ఉక్కివుఁడు = కపటముగలవాఁడు. 35. మ్రాన్పడి = నిశ్చేష్టతనొంది. 36. ఇంత+దనుక = ఇందాఁక. నీడు పలుకులు. నీ. నా. తన శబ్దములయొక్క కు మాఱు దుగాగమము. దెండము (రూ) దండము. నయ+అనయంబులు=న్యాయా న్యాయములు. ద్వం. స. 38. చవి=రుచి. బీజంబు=గింజ. 39. మాలకరి = పూలమాలికలు గట్టువాఁడు. పువ్వుఁదేనియ పువ్వు+తేనియ. సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమయంబులకుం బుంప్రులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. ఎదురు గందకుండఁగన్=ఇతరులు నొవ్వకుండఁగ. 40. విద్యాపరిణతికిన్ = విద్యయందలి సామర్థ్యమునకు. ఎరియఁగన్ = పరితపింపఁగ. తెవులు=రోగము. 42. కటకటయున్ = మనస్తాపమును. ధర్మము (నానా) న్యాయము, యజ్ఞము, విల్లు. తులువతనంబు = కుత్సితబుద్ధి. 43. బెడిదముగన్ = కఠినముగ. గొడ్డట. ఔప. విభ. చెడఁదునిసిన=చెడిపోయిన. నిగుడనేరదు=చక్కఁబడదు. 44. అలుఁగులన్ = ములుకులను. రూ. అల్గులన్. (నానా) ఖడ్గము, చెఱువు నిండినపుడు నీళ్లుపోవుట కేర్పఱచినదారి. అలుగు = కోపముచేయు. అనువునన్ = ఉపాయముతో. 45. ఆస్యము = నోరు. నికృష్టవాక్యముల్ = నీచవాక్యములు. స్రుక్కక = సంకోచింపక. అనురూపమె = తగునా ? 46. నెఱిగాని తెరువు వట్టు కర్జములు = న్యాయ్యముగాని మార్గమునఁ ద్రోయు కార్యములు. అవినీతులని = నీతిబాహ్యములని. 47. పాండవులతోడి విరోధంబు - చేత, తోడవలనలకిత్వంబు సమాసంబులందగు. గరిష్ఠుండైన=మిక్కిలి గొప్పవాఁడైన. సిరి (వి) శ్రీ - (ప్ర) వెలిదై=పొందనివాఁడై. తనివోవదు=తృప్తినొందదు. 48. శ్రుతులు=వేదములు. 49. పొగడిత=కీర్తి. అంద్రుడు. సూ. రువర్ణకంబు పరంబగునపుడు నున్నమీఁది తదదల యుత్వంబునకు లోపంబు విభాషనగు. 50. ఒడ్డుగానొడ్డి = పందెముగాఁబెట్టి. పన్నిదంబు సఱచి = పందెము ఒడ్డి. లాఁతి = ఇతరుఁడు. ... ఉపేతులు = కూడుకొన్నవారు. తెఱంగు

సేయుము=సంధిచేయుము. 51. కర్జములు=చేయఁదగినవి. కార్యములు (ప్ర) ఏపునన్=గర్వముతో. పరిణతిన్=అభ్యాసమును. 52. ఘర్మము. రూ. ధర్మము. సూ. అర్ఘాదుల కడయచ్చున దుత్వంబును, మీఁద వర్ణకంబును వైకల్పికంబుగానగు. అర్ఘ, వర్గ ఇవి యర్ఘాదులు. 53. అస్థితములైన = నీచములైన. కనిష్ఠములు = అధమములు. నీతికి బాహ్యలైన = న్యాయమును దప్పినవారైన. 54, కయ్యము (వి) కలహము (ప్ర). కాలుద్రవ్వెదురు = ప్రేరేపింతురు. పుత్త్రి (పుత్+త్ర). వ్యు. పుం అనెడి నరకము నుండి రక్షించువాఁడు. సూతపుత్త్రుఁడు = కర్ణుఁడు. బిరుదులు= శూరులు. 55. ఎదు రేచినన్ = శత్రువులు పైకి వచ్చినయెడల, ఏచు = అతిశయించు, పెరుఁగు, విజృంభించు, ఏఁచు = బాధించు. 56. సముచితము = తగినట్టిది. అమలమతిన్ = కపటము లేనిబుద్ధితో. వారని యలజడి = తీఱని కష్టము. ఏడుగడ (ఏడు+కడ) — గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత అను ఏడు విధములైన రక్షకము. 59. ప్రోపు=పోషణము. ప్రాపు = ఆశ్రయము. ఎల్లవెంటలన్ = అన్నివిధములకును. కృతఘ్నుని = చేసినమేలు మఱచినవానియొక్క. కృతజ్ఞుఁడు = చేసినమేలు నెఱుఁగు వాఁడు. కబళింపన్ = తినుటకు. 60. కృతము=చేయఁబడిన యుపకారము. 61. దూఱొందుట = నిందపడుట. ఎడపడి = క్రమముగా. 62. రూపు + అఱున్ = రూపము నశించును. నలంగినన్ = కృశించినయెడ. పార్థివుఁడు = రాజు. వ్యు. పృథివికిఁ బ్రభువు. 64. రిత్త (వి) రిక్త (ప్ర) ఉడికించితిన్ = మనోవ్యథకలిగించితిని మిత్తి (వి) మృత్యువు (ప్ర) = చావు. మిగులకయున్నే = తప్పి పోవునా ? 65. నెవ్వగలు (నెఱ + వగలు) = మనోవ్యథలు. నివ్వటిల్లనీక = కలుగనీక రూ. నివ్వటిలనీక. 66. ఇంద్రియనిగ్రహంబు = ఇంద్రియములను జయించుట. (ఇంద్రియములు పది - త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వా, ఘ్రాణము-ఇవి జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము - ఇవి కర్మేంద్రియములు. ఏకాదశేంద్రియము మనస్సు. భూరి (నానా) బంగారు, అధికము, ఒకలెక్క. శాంతి = కామక్రోధాది రాహిత్యము. 68. జ్ఞాతుల పోరితమును = దాయాదుల కలహమును. కారించుట = కష్టపెట్టుట. 69. ఎలమి = సంతసము గలిగి యుండుట. నెమ్మి = ప్రేమము. 70. కరి = ఏనుఁగు. వ్యు. తొండము గలది. మతుబర్థ బహు. తురగము = గుఱ్ఱము. వ్యు. వేగిరముగాఁ బోవునది. ఘట్టనయున్ = రాయిడియును. అన్నదమ్ములు (అన్న + తమ్ములు) ద్వం. సమా. సూ. ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు. ఎరవయి=భేదిల్లి. ఎల్లిదమై=చులుకఁదనమై. పఱిపోదురు=నశింతురు.

## శ్రీమదాంధ్ర భాగవతము - నవమస్కంధము

# రంతిదేవుని చరిత్రము

### కవిజీవితము :

శ్రీమదాంధ్ర భాగవతమును బమ్మెర పోతరాజు రచియించెను. ఈతఁడార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; కౌండిన్యస గోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; తండ్రి కేసన; తల్లి లక్కమాంబ; కొడుకు మల్లన.

ఈతని వాసస్థలమును గూర్చి పెక్కు వివాదములు గలవు. కొందఱు కడప మండలములోని యొంటిమిట్ట యనియు, మఱికొందఱు నిజామురాష్ట్రములోని యోరుగల్లనియుఁ జెప్పుచున్నారు. ఇదమిత్థమని నిర్ణయింప నసాధ్యము.

సర్వజ్ఞసింగమహీపాలుఁడు క్రీ. శ. 1427 సం. దనుక రాజ్యమేలియుండెను. పోతన యాతని సమకాలీనుఁ డగుటచేఁ బోతనయు నాకాలమున నుండెనని తెల్లమగుచున్నది.

శృంగారనైషధాది బహుగ్రంథ నిర్మాతయగు శ్రీనాథకవి పోతనమహాకవి బావమఱఁది. భోజరాజీయకర్తయగు ననంతకవియు, విక్రమార్కచరితమును రచియించిన జక్కనకవియు, జైమినిభారతమును వ్రాసిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడును నీతని సమకాలికులు.

ఈ మహాకవికి సహజపాండిత్యుఁడను బిరుదము గలదు. ఈతఁడు కల్పవృక్ష ప్రాయమగు భాగవతగ్రంథమును రచియించెను. వీరభద్రవిజయమును, భోగినీదండకమును గూడ వ్రాసెనందురు. కాని, నిజమూహింపఁజాలము. కారణాంతరములచే భాగవతమునందలి భాగములు కొన్ని యుత్సన్నములు కాఁగా నాభాగముల నేర్చూరి సింగయ, వెలిగందలనారయ, గంగన యను వారు పూరించిరి. పోతనకవిత్వ మనర్గళ ధారగలదై, శబ్దాలంకార భూయిష్ఠమై, భక్తిరస ప్రధానమై యొప్పుచున్నది.

### రంతిదేవుఁడు:

పూరునివంశస్థుఁడు; సంకృతి కొడుకు. తన సంచితార్థమంతయు నీనుల కొసఁగి, సభార్యుండై యడవులఁ గ్రుమ్మరుచు నొక్కనాఁడు దైవవశమునఁ బదార్థంబు చేకూడ క్షుత్పిపాసా పీడితుఁడై, తన భాగమును దాను గుడువఁబోవు తఱి నటకేతెంచిన యభ్యాగతుల కొసఁగి, తాను ద్రాగనుంచుకొనిన నీరమును సహిత

యొక్క చండాలున కతిప్రీతి నర్పణసేసి, యీశ్వరుని ధ్యానించుచు నిర్వికారముతో నుండె. అంత, బ్రహ్మాది దేవతలాతని ధార్మికత్వమునకు మెచ్చి, ప్రసన్నులయి మోక్ష మొసఁగిరి.

టిప్పణము :

1. రాజు (నానా) ప్రభువు, యక్షుఁడు, ఇంద్రుఁడు, చంద్రుఁడు. సంచిత+అర్థంబులు=కూడఁబెట్టఁబడిన వస్తువులు. అర్థము (నానా) శబ్దార్థము, ప్రయోజనము. న్యాయము, వస్తువు, ద్రవ్యము. అర్ధము=తునుక, సగము. ఎడపక=సంతతము. వృత్తి (నానా) నడవడిక, జీవనోపాయము. నీరువట్టు = దప్పి. 3. అతిథి = భోజనకాలమున కాగంతుకముగ వచ్చినవాఁడు. అభ్యాగతుఁడు=పండుగ పర్వములకు భోజనమునకు వచ్చెడివాఁడు. కడపక = పొమ్మని త్రోసిపుచ్చక. గారవించి (వికృ) గౌరవించి (ప్రకృ). హరి (నానా) విష్ణువు, ఇంద్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, సింహము, గుఱ్ఱము మొ. అశన+అర్థి=అన్నము నాసించినవాఁడు. కుక్కగమి = కుక్కలగుంపు. సత్+నయంబులు+ఆడి=మంచి నీతివచనములు పలికి. 4. పానీయము = త్రాగఁదగిన జలము. 5. దీన+ఆలాపంబులు = దైన్యముతోఁగూడిన పలుకులు. 6. మధుర+అంబువులు=తీయనినీరు. క్రన్నన=శీఘ్రముగా. మాన్చి - సూ. చువర్ణకంబు పరంబగునపుడన్యాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు. పుల్కసా ! =మాలవాఁడా ! వ్యు. పెద్దలను స్పర్శచేతఁ జెఱుచువాఁడు. 8. హృజ్జ్వరము (హృత్+జ్వరము) హృదయతాపము. 10. నారాయణుఁడు. వ్యు. జలము స్థానముగాఁగలవాఁడు. మాయాపారజ్ఞుఁడు=మాయయొక్కయంతు దెలిసినవాఁడు. పరమపదము = వైకుంఠము (మోక్షము).

---

శ్రీమదాంధ్ర భాగవతము

దశమస్కంధము - పూర్వభాగము

# శ్రీ కృష్ణావతారఘట్టము

టిప్పణము:

1. పంకజముఖి=తామరవంటి ముఖముగలది. ఉపమిత బహువ్రీహి. సంకటము=బాధ. 2. జలరాసులు = సముద్రములు (ఇవి యేడు - లవణ, ఇక్షు, సురా,

సర్పిః, దధి, క్షీర, జలసముద్రములు) కలఘోషములన్ = అవ్యక్త మధురములైన ధ్వనులతో. ఘోషము (నానా) గొల్లపల్లె, ధ్వని, ఆలమంద. తెలివిఁదాల్చెన్ = ప్రకాశమునందెను. అనలంబు = అగ్ని. అనిలము=గాలి. కమల+అళికులములు+ఐ = తామరపువ్వులయొక్కయు, తుమ్మెదలయొక్కయు సముదాయములు గలవై. ప్రవిమలతోయలై = నిర్మలమైన నీరుగలవియై. అలరుసోనలు = పూలవానలు. 3. చారణుఁడు=ఒకజాతి ఖేచరుఁడు. 5. నడురేయి (రూ) నడిరేయి, నడికిరేయి. తార = నక్షత్రము (నానా) బృహస్పతిభార్య, వాలిభార్య, కనుగ్రుడ్డు. దితిసుత నిరాకరిష్ణున్ = అసురులను నిరాకరించు స్వభావముగలవానిని. శ్రితహృదయాలంకరిష్ణున్ = సేవకుల హృదయముల నలంకరించువానిని. జిష్ణున్ = జయశీలుఁడగు వానిని. విష్ణువు. వ్యు. సర్వవ్యాపకుఁడు (వి) వెన్నుఁడు. 6. మెఱుఁగుఁబోడి=మెఱుపువలె మనోజ్ఞమైన మేనుగలది - స్త్రీ. సూ. బహువ్రీహిని స్త్రీవాచ్యం బగుచో నుపమానంబు మీఁది మేనునకుఁ బోఁడియగు. కళానిధి=చంద్రుఁడు. మహేంద్ర + ఆశ=తూర్పు దిక్కు. ఆశ (నానా) దిక్కు, కోరిక, వికృ. ఆస. 8. జలధరము = మేఘము. ఉపపదసమా. ఆజాను = మోఁకాళ్లదనుకనున్న (దీర్ఘములైన). కటీసూత్రము = మొలత్రాడు. కంకణము (నానా) జలబిందువు, చేతఁగట్టుకొనెడు తోరము, కడియము, గాప్రులుఁగు. వైదూర్యము (రూ) వైడూర్యము (విడూర దేశమునందుఁ బుట్టిన రత్నము) పూర్ణ + ఇందు రుచిజాలున్ = పూర్ణచంద్రునియొక్క కాంతులవంటి కాంతులయొక్క సముదాయముగలవాఁడు. సుగుణ+ఆలవాలు = సుగుణములకునికి పట్టైనవాఁడు. పులకించి = గగుర్పాటుగలవాఁడయి. 9. స్నానము (ప్ర) తానము (వి) 11. ఉద్యత్ దీపంబు = ఎత్తిన దీపము 12. కేలుఁదమ్మి = తామరను బోలినచేయి. సూ. సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. కీలుకొలిపి = చేర్చి. మొదలింటి పోకలెల్లన్ = పూర్వావతార చేష్టితములెల్ల. 13. మాయాదూరునిన్ = మాయకు దూరమైనవానిని. 14. అచ్చుగన్ = శుద్ధముగ. త్రిగుణములు=సత్త్వము, రజస్సు, తమస్సు అను మూఁడుగుణములు. జగము (రూ) జగత్తు. 16. మూఢతముఁడు = మిక్కిలి మూఢుఁడు. 19. మేఁడ్రింపన్ = భేదింపఁగా. తొడిన్ = త్వరతో. పంటింపండు = జాగుసేయఁడు.

---

## శ్రీ కాళహస్తి మహాత్మ్యము - తృతీయాశ్వాసము

# దుర్భిక్ష వర్ణనము

### కవిజీవితము :

శ్రీకాళహస్తి మాహాత్మ్యమును ధూర్జటికవి రచియించెను. ఈతఁడు పాకనాటి యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు; భారద్వాజసగోత్రుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; పరమశివ భక్తుఁడు.

ఈతఁడు శ్రీకృష్ణ దేవరాయల యాస్థానమున నెలకొని యుండిన † యష్టదిగ్గజములలో నొక్కరుఁడు. కావున నీతఁడు క్రీ. శ. 1520 సం. ప్రాంతముననుండినవాఁడు. ఇతఁడు తన గ్రంథమునందు నన్యదేశ్యములైన తమిళపదములను మిక్కుటముగఁ జేర్చి యున్నాఁడు. కాళహస్తీశ్వర శతకమును సహితమితఁడు రచియించెను. కవనము రసవంతమై, ధారావిశుద్ధిగ నుండును.

శ్రీకాళహస్తి—శ్రీ - సాలెపురుగు; కాళ (ము) = నాగుఁబాము; హస్తి = ఏనుఁగు. ఈ మూఁడు ప్రాణులకును శివైక్యము గలిగిన స్థలముగావున నా క్షేత్రమునకు 'శ్రీ కాళహస్తి' అను పేరుగలిగెను. ఇది యాక్షేత్ర మాహాత్మ్యమును దెలుపు గ్రంథముగాన దీనికిఁ గాళహస్తి మాహాత్మ్యమను పేరు గలిగెను.

### కథా సందర్భము :

మధురాపురమును బాండ్యరాజు శౌర్యవంతుఁడై పరిపాలన మొనర్చుతతి నక్కీరాది కవులు సంఘఫలకమను నొకఫలక నధిష్ఠించి యుండిరి. ఆ సమయమునఁ గఱవు తలసూపెను.

### టిప్పణము :

1. గ్రహవక్ర......క్షోభంబు — గ్రహవక్ర = గ్రహములు వక్రించుట చేతఁ గలిగిన, అభద్ర = అరిష్టము చేతనైన, క్షామ = కఱవునలని, మహాక్షోభము = మిక్కిలి కలఁతపాటు. వర్షము (నానా) వాన, సంవత్సరము, జంబూద్వీపము, భారతాది.

---

† 1. అల్లసాని పెద్దన్న 2. ప్రబంధాంకము రామరాజ భూషణుఁడు (భట్టుమూర్తి) 3. ముక్కు (నంది) తిమ్మన్న 4. పింగళి సూరన్న 5. తెనాలి రామకృష్ణకవి. 6. అయ్యలరాజు రామభద్ర కవి. 7. మాదయగారి మల్లన 8. ధూర్జటికవి.

2. మీనరాశికి (రాసులు పండ్రెండు — మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము) ధూమకేతువు = తోఁకచుక్క, జీమూత = మేఘము. వ్యు. ఉదకము దీనియందు బంధింపఁబడును. రేపాడి = ప్రాతఃకాలమందు. తుషారంబు = మంచు. కర్వలి = గాలి (రూ) కరువలి. కుముదాప్తధారణకొమ్ము = చంద్రుని యిరువైపుల కొమ్ములలో నొకటి, తఱిగెఁ = తగ్గెను (విదియ నాఁటి చంద్రుని రెండు కొమ్ములును సమముగా నుండిన వస్తువుల వెలలు సమముగానుండును. కుడివైపు కొమ్ము తగ్గినయెడలఁ గొలువఁదగిన వస్తువుల వెల హెచ్చును. ఎడమవైపు కొమ్ము తగ్గెనేని తూఁచునట్టి వస్తువుల వెల హెచ్చును) జముదెసన్ = దక్షిణదిక్కున. యముఁడు (ప్ర) జముఁడు (వి). తొలకరి= చైత్ర వైశాఖమాసములయందుఁ గురియు వాన. 4. గునుకులు = తృణధాన్యవిశేషము. 5. అలువదు = సస్యవిశేషము. గంటె = సజ్జలు. ఏతము = నీళ్లెత్తెడి యంత్రము (రూ) ఏయము. పఱిపఱియై = పీడితమై. మల్లెపడి = పురుగులు పట్టి. 6. ఎమ్ములు=ఎముకలు నిరస్తసస్యమై = పోఁగొట్టఁబడిన పైరుగలదియై. 7. నవయు = శుష్కించు. అశనము= అన్నము. శివశివ-సంతాపార్థకము. జీవ+అనిలముల్ = ప్రాణవాయువులు. 8. కరవెరుక = తృణవిశేషము. 9. హరద్విజుఁడు = శివబ్రాహ్మణుఁడు. ద్విజ. వ్యు. రెండు పుట్టుకలుగలవారు, కలవి. (నానా) బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, దంతములు. పక్షులు.

---

### కుమారసంభవము - తృతీయాశ్వాసము.

## పార్వతి పరమశివుని శుశ్రూషించుట.

కవిజీవితము :

ఈగ్రంథమును నన్నెచోడదేవుఁడు రచియించెను. ఈతఁడు సూర్యవంశమునకుఁ జేరిన క్షత్రియుఁడు. కావేరీ తీరమున నొరయూరను పట్టణము రాజధానిగఁ జేసికొని గోదావరీ సింహళమధ్య దేశము నేలెనని తెలియఁబడుచున్నది. ఈతని కాలనిర్ణయమును గూర్చి భిన్నాభిప్రాయములు గలవు. కొందఱు క్రీ. శ. 940 లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధమొనర్చి రణరంగమునఁ జనిపోయెనని యందురు. మఱికొందఱీతఁడు క్రీ. శ. 1150-1170 ప్రాంతమువాఁడని యందురు.

కవిత్రయమున మొదటివాఁడగు నన్నయభట్టారకుఁడెట్లు బ్రాహ్మణకవులలో నగ్రగణ్యుఁడాయెనో యట్లులే, నన్నెచోడుఁడు రాజకవులలో నగ్రగణ్యుఁడయ్యెను.

ఇతనికిఁ గవితా ప్రౌఢిమనుబట్టి కవిరాజ శిఖామణి యనియు, దిగ్విజయమును బట్టి టెంకణాదిత్యుఁడనియు బిరుదములు గలవు.

ఈ రాజకవి కవిత్వము రసవంతమై, యసాధారణ ధారకలదియై, హృదయంగమమై యొప్పుచుండును.

టిప్పణము:

1. పురాంతక=ఈశ్వరునియొక్క (తారకాసురుని కొడుకులగు కమలాక్షుఁడు, విద్యున్మాలి, తారకాక్షుఁడను రాక్షసులచే నిర్మితములగు త్రిపురములను బరిమార్చినవాఁడు గావున శివుఁడు పురాంతకుఁడనఁబడెను) అనంత సంభ్రమాత్యంత మనోనురాగమునన్=అంతులేని తొట్రుపాటువలనఁ గలిగిన యత్యధికమైన మనఃప్రీతితో. వాజి=గుఱ్ఱము. వ్యు. వేగముగలది. వరూథ=రథముమీఁది కప్పు (అనఁగా నిట రథములని యర్థము) పురోహితుఁడు=మంచిచెడ్డలను దెలుపుచు వైదిక కర్మములను జేయించునాచార్యుఁడు. వ్యు. శాంతిక పౌష్టికాది క్రియలయందు ముందఱ నుంచఁబడువాఁడు. 2. కళత్రము=భార్య (నానా) పిఱుఁదు, కోట. ముహుః+ముహుః+మహీతల+అలంకృత సర్వ+అంగుఁడై=మాటిమాటికి భూమిని దాఁకునట్టి యన్ని యవయవములు గలవాఁడై (అనఁగా నమస్కరించి) శ్రీ. (నానా) లక్ష్మి, సంపద, ఐశ్వర్యము మొ. 4. అచల+అధీశ్వరుఁడు=పర్వతరాజు (హిమవంతుఁడు) ఆప్లావితుండు = తేలునట్లు చేయఁబడినవాఁడు. రుద్రుండు=శివుఁడు. వ్యు. ఒకానొకప్పుడు బ్రహ్మవలన జన్మమును బొందినవాఁడై దుఃఖించెను గనుక రుద్రుఁడు; దుఃఖమును బోఁగొట్టువాఁడు. 5. హరి సరోజగర్భులు=విష్ణువు, బ్రహ్మ. 6. కేదార+ఆత్మకుఁడనయి=కేదార క్షేత్రమే నా స్వరూపముగాఁ గలవాఁడనై. (హిమవత్పర్వతమందుఁ గేదారమను నొక క్షేత్రము గలదు). 7. అహః+అహముఁబు=ప్రతిదినము. తలఁతున్=చింతించుచును. పరువుఁబనులు=పరిచర్యలు. 8. అప్రతిపచనుఁడు=మాఱులుకనివాఁడు. ఆకల్పము=భూషణము. అంతఃపురము (ప్ర) అంతిపురము, అంతిపురి (వి). 10. పార్వతి వ్యు. పర్వతమునకుఁ గూఁతురు. అప, తద్భ. అగ్గలించుచుండఁగ = అతిశయించుచుండఁగా. 11. చమరీజ బర్హమార్జనులన్ = చమరీ మృగములయొక్క తోఁక కుచ్చునెడి చీఁపురులచేత. కర్దమము = అడుసు. కాశ్మీర = కుంకుమ. మాంజిష్ఠము = ఎఱుపుమించిన పసుపువన్నె. కోరకంబులన్ = మొగ్గలచేత. దామంబులు = పూలహారములు. ధామంబులు = ఇండ్లు, కాంతులు. సౌరభము = వాసన (నానా) కుంకుమము, ఎద్దు. 12. చంద్రశేఖరుఁడు = శివుఁడు. వ్యు. చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడు. అంగజ చక్రవర్తి = మన్మథుఁడను రాజు. దోః+బలమునన్ = భుజ పరాక్రమము చేత. అచలనందన = పార్వతి.

అహికుండల మండిత గండమండలుఁ = పాములనెడి కర్ణభూషణములచేత నలంకరింపఁబడిన చెక్కిళ్లుగల వానిని. 14. మొనలావులించి=చివరలు వికసించి. పసిగొని = వాసనపట్టి. లేఁదేఁటిగములు=కుమ్మెద కొదమల సమూహములు. లేఁదేఁటి (లేత+తేఁటి) సూ. 1. సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. 2. లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు. 3. ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు. 4. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు. ఏగులింపకుండఁ = ఎంగిలి చేయకుండ. తెమ్మెర (తెమ్మ+ఎర)=తడితోఁ గూడినగాలి. పుప్పొడి (పూ+పొడి; = పుష్పరజము. తరణి = సూర్యుఁడు. వ్యు. అంధకారము నితనిచేతఁ దరింతురు) ఆకాశమును దాఁటువాఁడు. (నానా) ఓడ, పిన్నగోరంట మొక్క, సముద్రము. గోమిని = గిల్లపడఁతి. అకరువు = తామరపువ్వులోని కేసరము. జక్కవ (వి) చక్రవాకము (ప్ర).

---

# నీతిపద్యములు

ఈ శీర్షిక క్రింద వ్రాయఁబడిన మొదటిగ్రైదు పద్యములును 'భర్తృహరి సుభాషితము నుండి యేర్చికూర్చినవి. ఈగ్రంథమును సంస్కృతమున భర్తృహరి యను నొక రాజర్షి చంద్రుఁడు రచియించెను. తెనుఁగున ఏనుఁగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన యనువారు వ్రాసిరి. ప్రకృత పాఠ్యభాగము నందలిపద్యములు ఏనుఁగు లక్ష్మణకవి రచితములు. భర్తృహరి సుభాషితము నందలి నీతి శతకము లోని సుజన పద్ధతి లోనివి.

మిగిలిన యైదు పద్యములును భాస్కర శతకములోనివి. ఇది నీతి బోధకమగు శతక రాజము. దీనిని రచియించినకవి యెవ్వఁడైనదియు విస్పష్టముగఁ దెలియకున్నది.

టిప్పణము :

1. తటి=సమయము. తరి=ఓడ. అభినవోత్పల కోమలంబు=క్రొత్తగ వికసించిన నల్లకలువ పూవువలె మృదువైనది. మహామహీ ధరాశ్మ సంఘాత కర్కశంబు=గొప్ప కొండబండల మొత్తము వలెఁగఠినమైనది. 2. మలీమసము=మలినత్వమును జెందిన నడవడి. అగ్రాహ్యము=అవలంబింపరాదనుట. అసంపత్ + ప్రార్థన+ అభావముఁ నిర్ధనుని యాచింపకుండుటయు. వ్యసనా వాప్తినిఁ=వ్యసనము పొందినప్పుడు. అసిధారావ్రతచర్య=కత్తివాదర మీఁద నిలిచి చేయువ్రతము. మహార్ఘ్య శ్రేణికిఁ=గొప్ప

వారికి. 3, తప్తలోహము=కాఁచఁబడిన యినుము మొదలైనలోహము, అనామకమై=పేరులేక. నళినీదళ సంస్థితమై=తామరాకుపైఁ జక్కఁగా నిలిచినదియై. శుక్తి=ముత్తెపుఁజిప్ప. 4. సత్+కళత్రము=ఉత్తమురాలగు భార్య. విపత్తి సౌఖ్య సదృశ క్రియుఁడు = కష్టసుఖములయందు సమానముగ నుండువాఁడు. 5. సమంచిత=బాగుగా నొప్పుచున్న. క్షమాధృతి=ఓర్పును వహించుట. 6. సమగ్రతాభోగము = నిండగు సుఖానుభవము. భూరిసత్త్వసంయోగ మద+ఇభకుంభ యుగళ+ఉత్థిత మాంసము=ఎక్కువ బలముతోఁ గూడిన మదపు టేనుఁగు కుంభస్థలములందుఁ బుట్టిన మాంసము. సింహము (ప్ర)సింగము (వి) 7. కట్టడ = (దైవనిర్మిత) నియమము. మర్త్యుఁడు=మనుష్యుఁడు. వ్యు. మర్త్యలోకమునఁ బుట్టినవాఁడు. 8 కామిత=కోరఁబడిన. భ్రామిక పడ్డ=భ్రమ పడిన. ముసిండి=ముష్టి చెట్టు (రూ) ముసిణి.0. ఓటు - ప్రశ్నార్థక ప్రత్యయము. 10 జాణ=నేర్పరి. చిప్పిలి పోయిన=కాఱి పోయిన.

---

# నీతిచంద్రిక

## మిత్రలాభము

నీతి చంద్రిక యన నీతికి వెన్నెల వంటిది. వస్తుసముదాయమును జూచుటకు వెన్నెలయెట్లు తోడ్పడుచున్నదియో యట్టులే నీతులను గ్రహించుట కీపొత్తము మనస్సునకు సాయపడుచున్నది,

సంస్కృతములోనుండెడి హితోపదేశము, పంచతంత్రము అనుగ్రంథములుదీనికి మాతృకలు. ఇదిమిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహమనెడి నాలుగుతంత్రములు గలగ్రంథము. ఈ పుస్తకమునందుఁ గొంతభాగము (మిత్రలాభము, మిత్రభేదము) పూర్వము చెన్నపురి రాజకీయకళాశాలయందాంధ్ర పండితులుగ నున్న పరవస్తు చిన్నయ సూరిగారిచే రచియింపఁబడెను. తక్కిన భాగమును వేఱు వేఱుగ మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారును, రావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులు గారును రచియించిరి. చిన్నయ సూరిగారు బాల వ్యాకరణమను గ్రంథమును గూడ రచియించిరి.

టిప్పణము :

సత్+లాపములు = మంచి ముచ్చటలు. పరువంబు = యౌవనము. అరయమి=అవివేకము. అగోచర+అర్థవిజ్ఞానము = అగపడని పదార్థములయందలి తెలివి. క్రీడా

పరాయణులయి = ఆటలయందాసక్తిగలవారై. యశము (ప్ర) అసము (వి). ప్రథమగణ్యుఁడు = మొదటనెన్నఁదగినవాఁడు. గొఱ్ఱాలు (గొడ్డు+అలు) సూ. - పేదాది శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. ఉంకించి = ఊహించి. పంకించి = ఊఁచి. పురుషకారము = పురుష ప్రయత్నము. శర్మ, వర్మ, గుప్త, దాస - అనునవి క్రమముగా బ్రహ్మ, క్షత్త్రియ, వైశ్య, శూద్రుల నామాంతములఁ గన్పట్టెడిని. దేవర (వి) దేవ (ప్ర). పసదనము = బహుమానము (ప్రసాదశబ్దభవము) జనుపాంథులు = పుట్టుగ్రుడ్డులు. సౌధము = రాజగృహము. వ్యు. సున్నముతోఁ గట్టఁబడినది. విగ్రహము = కలహము. (నానా) శరీరము, విభాగము, షడ్గుణములలో నొకటి మొ. సంధి = కూడిక. ధనసాధనము= రూ. సమా. కిరాతుఁడు= బోయవాఁడు. కిరాటుఁడు = కోమటి. పలువాత = వేసవ. కంకణము = కడియము. (నానా) రాపులుఁగు, జలబిందువు, చేతఁ గట్టుకొనెడు తోరము. పాంథుఁడు = బాటసారి. సంశయపడక = అనుమానింపక. సూ. పద్వాదులు పరంబులగునపుడు ముపర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు. రొంపి = బురద. కొఱమాలిన శంకలు= పనికిమాలిన యనుమానములు. ఈర్ష్యాళువు = ఓర్వలేనితనముగలవాఁడు. జుగుప్సావంతుఁడు = రోఁతగలవాఁడు. పరభాగ్య+ఉపజీవి = ఇతరుల సంపదచే జీవించువాఁడు. దుఃఖభాగులు = దుఃఖమును బొందువారు. కాపురుషలక్షణము = కుత్సితులయొక్క గుణము. ప్రతికారము = మాఱుచేఁత. పరాకు = ఏమఱుపాటు. సంఘీభవించి = ఒకటిగాఁజేరి. లాఁగ = బొటియ. లోక+ఉక్తి = సామెత. పురుషార్థములు—ధర్మార్థకామమోక్షములు. వినశ్వరము = నశించునది. కళేబరము = శరీరము. ఆస్థ = అభిమానము. కల్పాంతస్థాయులు = ప్రళయకాలమువఱకు నుండునవి. భోజ్యమను = భుజింపఁదగినదానను. భోక్తవు = భుజించువాఁడవు. జంబుకము నక్క. వ్యు. మాంసమును భక్షించునది. మృగకాకముల—ద్వంద్వ. సమా. మృతకల్పుఁడనయి = చచ్చినవానితో సమానుఁడనయి. దైవము (ప్ర) దయ్యము (వి). తార్కాణము = దృష్టాంతము. మందార వృక్షము = బాడిదచెట్టు. మార్జాలము (రూ) మార్జారము. గృధ్రము = గద్ద. వ్యు. మాంసమును గాంక్షించునది. చీకు = గ్రుడ్డి. కోలాహలము = కలకలము= బిడాలము = పిల్లి. సురిఁగి=పాటి. వధ్యుఁడు = చంపఁదగినవాఁడు. వంద్యుఁడు = నమస్కరింపఁదగినవాఁడు. నిష్కాముఁడు = ఆశలేనివాఁడు. కరస్థము = అఱచేతిలోనిది. స్వచ్ఛందము = స్వతంత్రము. అక్కి = గిజి. చంచువులతోఁ = (పక్షుల) ముక్కులతో. కాలుఁడు = యముఁడు. వ్యు. ధర్మాధర్మములనైనను, ఆయువునైనను లెక్కపెట్టువాఁడు. క్షేత్రము = పొలము (నానా) వరిమడి, పెండ్లాము, శరీరము. భట్టారకవారము = ఆదివారము (భట్టారకుఁడు = సూర్యుడు) నిర్వాణము = అఱుట. ఇచ్ఛక

మాలు = ప్రియవచనములు. సంగాతకాఁడు=మిత్రుఁడు. పయోముఖ విషకుంభము పోలు ముఖమునందుఁగల విషము నించినకుండ. నిట్టూర్పు (నిడు+ఊర్పు) సూ. కుఱు చిఱు, కడు, నడు, నిడు శబ్దముల ఱడలకచ్చు పరంబగునపుడు ద్విరుక్త టకారంబగు. బడియ = కట్టు. బూరటించి=ఉబ్బించి. తాఁకువడి=దెబ్బతగిలి. సర్వధా=అన్నివిధముల చేత. ప్రాయోపవేశము=మరణమునకై చేయు నుపవాసవ్రతము. మృత్+ఘటము= మంటికడవ. గంధసారము=మంచి గంధము. హిమాంబుపూరము=పన్నీటివెల్లువ. వారిజాతవారము=కమలముల సమూహము. విస్రంభాలాపములు = నమ్మికను బుట్టించు మాటలు. గంతవ్యస్థానము=పోఁదగినచోటు. కతిపయ దినంబులకు=కొన్ని దినములకు. ధురీణుఁడు=శ్రేష్ఠుఁడు. పరివ్రాజకుఁడు=సన్న్యాసి. వ్యు. అన్నిటిని బరిత్యజించిపోవువాఁడు. భోజనము (ప్ర). బోనము (వి) స్వజాతిసామ్యము=తన జాతితోడి సాదృశ్యము. నిదాఘనదీపూరములట్లు=ఎండకాలమునందలి నదుల ప్రవాహములవలె. ఆపాతయాతనావహము=వచ్చినప్పుడు మాత్రమే వేదనను గలిగించునది, మూర్ధము= తల. గర్హితము=నిందితము. తొలఁగుట=విడుచుట, తిరియుట=భిక్షమెత్తుట. గోఁజక= పీడించి యడుగక. కాణాచి=తాతముత్తాతలు సంపాదించిన భూమి. (రూ) కాణయాచి. చెడగరపుబోడ=దుష్టుఁడగు సన్న్యాసి. విజనప్రదేశము=జనులులేనిచోటు. కాయగసురులు - ఇదియొక జాతీయము. పడియ=నీళ్లు నిలిచిన చిన్నపల్లము. సత్సంగతి=సత్పురుషుల సహవాసము. ఝరి=ప్రవాహము. బుద్బుదప్రాయము=నీటిబుగ్గవంటిది. శోకాగ్ని-రూ. సమా. పరీవాహము=అలుఁగు. త్యాగము=ఈవి. (ప్ర) చాగము (వి) సింగాణి=మూఁడు శిఖరముల విల్లు, తూఁపులు=అమ్ములు. వింధ్యాటవి. సంభా. పూ. కర్మ. సమా. వది=మాటు. మచ్చు=మృగాదులఁబట్టుటకై యుంచెడి యాహారము. అలకడ=మూఁపు. పుష్కలము=సమృద్ధము. గొనయము=వింటినారి. గనయము=వింటికొప్పు. ఒలుచు=బాధచేఁ గూయుచు. వితాకుపడరు=నిశ్చేష్టితులుగారు. నైసర్గిక తేజము=స్వాభావిక పరాక్రమము. దుఃఖ+ఏకమూలము=బాధకేకారణమైనది. వృ. సం. నిస్స్పృహత్వము=ఆశలేమి. వ్యాళము=పులి (నానా) పాము, తులువయేనుఁగు (రూ) వ్యాడము. ధనతృష్ణ=ధనమునందలి యాస. సప్త. తత్పు. సమా. సన్నికర్ష ప్రభావము=సాన్నిధ్యముయొక్కమహిమ. ప్రణయము=స్నేహము. వాగ్దోషము=నోటితప్పిదము. జొంపము=గుబురు. కొలఁకులు=మెఁతగల చోటులు. ప్రతీచీముఖము=పడమటి దిశాభాగము. సిందూరము=చెందిరము. కొందలము=విచారము. చవుకళించి= నాలుగుకాళ్లతో నెగిరి. నూడిద=కానుక. సాహిణము=గుఱ్ఱపుసాల. జంగెలు=చిన్నిగంటలు. ప్రమదవనము=అంతఃపుర స్త్రీలు విహరించు తోఁట (రూ) ప్రమదావనము. శ్రవణకుహరములు=చెవిరంధ్రములు. విదారించు=బ్రద్దలుచేయు. దువాళించు

చుక్ = పరుగెత్తుచు. సద్యః+జాతము = అప్పుడే పుట్టినది. కదంబముకుళజాతము= కడిమి మొగ్గలరాశి. లంపతౌవానిక్ = దాసీపుత్త్రిని. అరిష్టసూచకము=చెడుగును దెలుపునది. ఊడనిఁబాడు=పరుగెత్తు. నిస్తరించితిమి=దాఁటితిమి. ప్రతీకార గవేషణము=ప్రతిక్రియను వెదకుట. ప్రాఁగన్ను=సగము మూయఁబడినకన్ను. తత్+ఉక్త ప్రకారమునక్=హిరణ్యకుఁడు చెప్పిన విధముగా.

---

ఆంధ్రవచన భారతము

# ద్రౌపదీ వస్త్రాపహరణము

**కవిజీవితము :**

ఈ యాంధ్రవచన భారతమును కళువె వీరరాజు రచియించెను. వ్యాసరచిత సంస్కృత భారత మీ గ్రంథమునకు మాతృక.

వీరరాజు క్షత్త్రియవంశజుఁడు; భారద్వాజసగోత్రుఁడు; ఋక్శాఖీయుఁడు; దొడ్డభూపాలుని పుత్త్రుఁడు. మైసూరు రాష్ట్రమును క్రీ. శ. 1672–1704 వఱకుఁ బరిపాలించిన చిక్కరాయల సంస్థానమునం దీ వీరరాజు రాజకీయోద్యోగిగా నుండెను.

ఈతఁడాంధ్ర గీర్వాణ కర్ణాటకభాషల యందసమాన పాండిత్యము గలవాఁడు. ఏతత్కవిరచిత భారతమె యాంధ్రవచన గ్రంథముల యందెల్లఁ బ్రాచీనతర మని చెప్పనగును. ఈకవి తనయుఁడగు నంజరాజు కర్ణాటక భాషయందు హాలాస్య మాహాత్మ్యము, భగవద్గీతలను గ్రంథములను వచనముగవ్రాసి, భారతమును సహితము రచియించెనందురు. వీరరాజురచన మతిమధురమై, ద్రాక్షాపాకమున నొప్పుచుండును.

**టిప్పణము :**

1. సౌబలుఁడు=శకుని. అప. తద్ధి. అజాతశత్రువు=ధర్మరాజు. పన్నిదము=పందెము. యౌవనము (ప్ర) జవ్వనము (వి). ఉత్పలగంధి=కలువపువ్వుయొక్క వాసనవంటి వాసనగలది. ఔదల=శిరస్సు. ఆశీవిషము=పాము. (వ్యు) కోఱయందు విషము గలది. అక్షంబులు=పాచికలు. ప్రహాసభాసమానముఖుఁడు=నవ్వుచేఁ బ్రకాశించు ముఖముగలవాఁడు. 2. సమ్మార్జనము=తుడుచుట. వైరము (ప్ర) వేరము (వి) ద్యూతంబు

(ప్ర) జూదఁబు (వి) అశ్లీల భాషణంబులు=అమంగళవాక్యములు. ఘంటాపథంబు=రాజమార్గము. 3. కౌంతేయులు=కుంతికొడుకులు. అప. తద్ధి. కంఠీరవము=సింహము. వ్యు. కంఠమందు ధ్వనిగలది. యాజ్ఞసేని=ద్రౌపది. దురోదరంబు=జూదము. దేవనంబు=గెలువనిచ్చు. ఉపలక్షించి=చూచి. దుర్నయము=అన్యాయము. దిగ్గన=తటాలున. రాజసూయము=ఒకరాజు తక్కిన రాజులను జయించి చేసెడి యజ్ఞము. అవభృథంబు=యజ్ఞాంతస్నానము. సిక్తంబులు=తడిసినవి. అరాళంబులు=వంకరలయినవి. గద్గదస్వరంబు=డగ్గుత్తికపడిన స్వరము. ఋతుమతి=ముట్టైనకాంత. వికీర్ణకేశి=చెదరిన వెంట్రుకలుగలది. విశీర్ణకుంతల=శిథిలములైన ముంగురులు గలది. అట్టహాసము=పెద్ద నవ్వు. 4. తిలకము (నానా) పుట్టుమచ్చ, బొట్టుగుచెట్టు, పొట్లచెట్టు, శ్లేష్మము, బొట్టు, రోషారుణిత లోచనుండు=కోపముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడు. 5. లక్ష్యము=గురి. ఆకర్ణింపుఁడు=వినుఁడు. 6. చతుర్విధ వ్యసనములు - జూదము, పానము, వనితాసక్తి, వేఁట; సప్తవ్యసనములు - పానము, స్త్రీ, మృగయ, ద్యూతము, వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము. పిక్కటిల్లు=అతిశయించు. అరణి=మథించి నిప్పుఁ బుట్టించెడి కొయ్య. 7. చేలాంచలము=వస్త్రపుఁ కొంగు. శరణాగత=శరణు చొచ్చినది. ఉపేక్ష X అపేక్ష. వసనము=వస్త్రము. కైవడి=వలె - ఉపమావాచకము. 8. ఆటోపము=వేగిరపాటు. ఔడుగఱచి=పెదవి కొఱికి. ప్రక్కలించి=భేదించి. రుధిరము=రక్తము. అనృతము X ఋతము. లజ్జ=సిగ్గు. 9. క్లేశపడు=దుఃఖపడు. లోభమోహపరాయణులు=పిసినిగొట్టుతనమునందును, స్త్రీ వాంఛయందును ఆసక్తిగలవారు. మహాకులప్రసూతులు = గొప్పవంశమున జనించిన వారు. ప్రభృతులు=మొదలగువారు. 10. భయభక్తులు - ద్వంద్వ. సమా. (విగ్ర) భయము. భక్తి. రాధేయుఁడు=కర్ణుఁడు. అప. తద్ధి. కదళికాస్తంభ సంకాశంబు=అరఁటి కంబముతోఁ సమానమైనది. సర్వలక్షణ లక్షితము=అన్ని లక్షణములతోఁ గూడుకొనినది. కరికరోపమానము=ఏనుఁగు తొండముతోఁ బోల్పఁదగినది. ఊరుతలము=తొడప్రదేశము. ప్రహారము=దెబ్బ. వృక్షకోటరము = చెట్టుతొఱ్ఱ. కోటరము (నానా) చెట్టుతొఱ్ఱ, కోడఁట్రము. విస్ఫులింగంబులు=అగ్నికణములు. వృథాలాపంబులు=పనికిరానిమాటలు. 11. పరిమార్చు=చంపు. సదనము=గృహము. శైత్యంబు=చలువ. అన్యథాత్వంబు=వేఱువిధముగా నగుట. 12. నిశితశిలీముఖంబులు=వాఁడి బాణములు. శిలీముఖము (నానా) బాణము, తుమ్మెద. ప్రధనముఖంబునఁ = యుద్ధమునందు, అంతరిక్షంబు=ఆకాశము. వ్యు. నక్షత్రములిందుఁ గలవు; దీనిలోపలను జగత్తు చూడఁబడును. 13. నికృష్ట+ఆత్ములు=నీచమైన మనస్సుగలవారు. ముహూర్తము (నానా) శుభకార్యములకు నిర్ణయించుకొనుకాలము, పండ్రెండు క్షణముల

కాలము, రెండు గడియల కాలము, అల్పకాలము. క్రోధఘూర్ణమాన హృదయుండు=కోపముచేఁ దిరుగుడుపడుచుండు మనస్సుగలవాఁడు. ఫాలాక్షుఁడు=శివుఁడు, అనలము=అగ్ని. అనిలము=గాలి. కులాచలంబులు_మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము అనునవియేడు. దివాకరుఁడు=సూర్యుఁడు. ఆఖండలనందనుఁడు = అర్జునుఁడు. పురందరతనూభవుఁడు=అర్జునుఁడు. 14. ఉపేంద్రుఁడు=విష్ణువు (కశ్యపున కదితిగర్భమున నింద్రుని తరువాత జనించుటచే నుపేంద్రుఁడను పేరుగలిగెను) కోపానలము. రూస. సమా. ఉపలాలితుఁడు = బుజ్జగింపఁబడినవాఁడు కార్ముకము=విల్లు. వ్యు. యుద్ధకర్మము కొఱకు సమర్థమైనది. విముక్తులు=విడువఁ బడినవారు.

---

## జైమిని భారతము

# ఉద్దాలక మహర్షి

ఈ గ్రంథమును సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు రచియించెను. ఈతని తండ్రి మీనాక్షి నాయకుఁడు ; తల్లి అలమేలమాంబ. మధుర రాజ్యమును 1704—1731 వఱకుఁ బరిపాలించిన విజయరంగ చొక్కనాథుని యాస్థానమున వేంకటకృష్ణప్ప నాయకుఁడు మంత్రిగా నుండెను. కావున, నీతఁడు పదునెనిమిదవ శతాబ్దియందు నుండినవాఁడు.

జైమిని భారత మెనిదాశ్వాసములు గల వచనకావ్యము. వేదవ్యాసుని శిష్యుఁడగు జైమిని సంస్కృతమున రచియించిన భారతమునకిది తెలుఁగు సేత. పదునేనవ శతాబ్దియందుఁ బిల్లలమఱ్ఱి పినవీర భద్రకవి సంస్కృతములోనున్న జైమినిభారతమును నాంధ్రమునఁ బద్యరూపముగ రచియించెను.

వేంకట కృష్ణప్పనాయకుఁడు జైమినిభారతమునే కాక, సారంగధర చరిత్రము, అహల్యా సంక్రందనము, రాధికాసాంత్వనమును ప్రబంధములను రచియించెను. జైమిని భారతమును పాండ్యమండలాధీశ్వరుఁడగు విజయరంగ చొక్కనాథుని కంకిత మొనర్చి, మిగిలిన గ్రంథములను శ్రీరంగస్వామికిఁ గృతి యొసంగెను.

జైమిని భారత రచనమించుక ప్రౌఢమై, రసవంతమై, దీర్ఘవాక్యములతో నొప్పుచున్నది.

**కథా సందర్భము :**

ప్రకృత కథను సౌబరియను మునివరుండర్జునున కెఱింగించెను.

**టిప్పణము :**

యథా + ఉక్తంబుగా = శాస్త్రమునందుఁ జెప్పఁబడిన విధమున. కర్కశ భాషిణి = కఠినముగా మాటలాడునది. ప్రతికూలము X అనుకూలము. మాధుర్యము = తీపు. బ్రహ్మకమ్మిపైచి = నడిమికి రెండుగాఁ జనిఁగిన కట్టుదోవతిని గలిపికట్టి. సూత్రము = రుద్రాక్షమాల. (నానా) నూలిపోఁగు, శాస్త్రాది సూచనా గ్రంథము, జన్నిదము, ఏర్పాటు. సమిధలు = చిదుగులు. రెంటికిఁ జెడ్డరేవఁడ్డై = రెండు పనులకుఁ జెడిన చాకలివాఁడై. (రేవఁడను నొక చాఁకలి యేటిలో నొక దాటిపైఁ గొన్ని యుదికిన బట్టలఁబెట్టి, మఱొక దాటిమీఁద బట్టల నుదుకుచుండఁగా వెల్లువవచ్చెను. అపుడు వాఁడుదికి పెట్టిన గుడ్డలకై పర్వెత్తఁగా నచ్చటికిఁ జేరునంతలో నాగుడ్డలు గొట్టుకొని పోయెను. అటనుండి మరల రెండవ దాటిదగ్గఱకు వచ్చునప్పటికి నవియుఁ గొట్టుకొని పోయెను. దానిఁబట్టి 'రెంటికిం జెడిన రేవఁడు' అను సామెత యేర్పడెను) రేవఁడు (నానా) రేవువాఁడు, చాఁకలవాఁడు, కృపణుఁడు, కుత్సితుఁడు. ఆనతి (వి) ఆజ్ఞప్తి (ప్ర). షట్ + రస + ఉపేతము = ఆఱురసములతోఁ గూడినది. (షడ్రసములు—కషాయము, మధురము, లవణము, కటువు, తిక్తము, ఆమ్లము). పైతృకము = పితృశ్రాద్ధము. కుండుఁడు = మగఁడుండఁగా అంకు మగనికిఁ బుట్టినకొడుకు (పుత్త్రులు పన్నిద్దఱు—ఔరసుఁడు, క్షేత్రజుఁడు, దత్తుఁడు, కృత్రిముఁడు, గూఢోత్పన్నుఁడు, అపవిద్ధుఁడు, కానీనుఁడు, సహోఢజుఁడు, క్రీతుఁడు, పౌనర్భవుఁడు, స్వయందత్తుఁడు, జ్ఞాతిరేతుఁడు) కుతపకాలము = మధ్యాహ్నానంతరము పదునాఱు పదునేడు గడియలకాలము. వేదములు—ఋక్కు, యజుస్సు, సామము, అధర్వణము. వేదాంగములు - శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. రంగవల్లికలు = ముగ్గులు. శృంగారము (ప్ర) సింగారము (వి). ప్రేక్షణీయంబులు = చూడఁదగినవి. బింబఫల డంబర విడంబనంబై = దొండపండుయొక్క విజృంభణము ననుకరించినదై. పార్వణము = పిండప్రదానము. ఆగ్రహవ్యగ్రుఁడు = కోపముచేఁ గలవరపడినవాఁడు. అశ్వమేధము = గుఱ్ఱమును విశసనముచేసి చేయు యజ్ఞము.

---

*

# అశ్వమేధము

టిప్పణము :

1. హాటకపుటిక = బంగారుగంప, హాటకము (నానా) బంగారు, ఉమ్మెత్త చెట్టు. వ్యు. ప్రకాశించునది. మురారి = కృష్ణుఁడు (మురాసురునకు శత్రువు) పిఱిఁది దెసకు = వెనుకవైపున. అధ్వరము=యాగము. సంభృతము=చక్కగా భరింపఁబడినది. మిళితములు = కలిసినవి. ఋత్విజుఁడు = యజ్ఞకర్తచేత ధనము పుచ్చుకొని యజ్ఞము చేయించువాఁడు. కుందనఁపుటిటికలు (కుందనము+ఇటికలు) సూ. కర్మధారయంబు లందు మువర్ణకంబునకుం బుంపులగు ; కర్మధారయంబునం దుత్తున కచ్చు పరంబగు నపుడు టుగాగమంబగు. వేదిక = తిన్నె. ఇష్టకాచయనము = ఇటికలతోఁ జేయు చయనమను యజ్ఞకర్మము. బదరీ బిల్వ పలాశ యూపంబులు = రేఁగు, మారేడు, మోదుగు కంబములు. స్రుక్కు = హోమ పాత్ర విశేషము.

2. వింశతి = ఇరువది. బ్రహ్మకల్పము = బ్రహ్మదేవుని దినము. బ్రహ్మకు 8 వేల యుగములైన నొక దినమగును. అధ్వర్యువు = యజ్ఞమునందు యజుర్వేద తంత్రమును నడుపువాఁడు. మృగశృంగము=జింకకొమ్ము. కుశము=దర్భ. పంచపల్లవ ములు—రావి, జువ్వి, మఱ్ఱి, మేడి, మామిడి. మౌక్తికంబులు=ముత్తములు. పురస్క రించుకొని = ముందిడుకొని. నారదుఁడు = దేవర్షి. వ్యు. జ్ఞానము నిచ్చువాఁడు. మూర్ధాభిషిక్తులు = రాజులు. భ్రాజితుఁడు = భూషణాదులచేఁ బ్రకాశించువాఁడు. సాత్రాజితి = సత్యభామ. అప. తద్ధి.

3. బంధుర = ఒప్పిదమైన. తరంగిణి = నది. వ్యు. అలలుగలది. హేమ కటా హంబులు = బంగారు కడవలు. యూప స్తంభము = యజ్ఞమునందుఁ బశుబంధనార్థమై నాటిన పైపట్టలేని కొయ్య. వలగొని = ప్రదక్షిణించి. విశసనంబు గావించి = చంపి. అపఘనము = శరీరము. ఘనసారము = కర్పూరము. పురోడాశము=యజ్ఞార్థమైన పిండి వంట ; హుతశేషమనియు. అవభృథము = యజ్ఞాంత స్నానము. రెట్టి = రెండంతలు. హర్షంబు (ప్ర) అరుసము (వి).

---

# తక్షశిలా

బదరికాశ్రమము :

హిమవంతమునకు సమీపమున సరస్వతీ నదీ పశ్చిమతీరమున నుండు నొకవనము. పుణ్యక్షేత్రము. పెక్కుఋషులిందాశ్రమములు గావించుకొని యుందురు. అందు విష్ణు

మూర్తి బదరీనాథుఁడను పేరఁ బ్రతిష్ఠితుఁడై పూజింపఁబడుచుండును. బదరియనరేఁగు చెట్టు. రేఁగుచెట్ల వనమగుటచే బదరికాశ్రమమను పేరు గలిగెను.

టిప్పణము :

నిదర్శము = దృష్టాంతము. వితస్త—పాంచాల దేశమునందలి యొకనది. మూలికలు = ఓషధులు. ఉచ్చదశ = ఉన్నతస్థితి. అష్టాంగములు — కాయము, బాల, గ్రహము, ఊర్ధ్వాంగము, శల్యము, విషము, రసాయనము, వాజీకరణము—వీనికిఁ జికిత్సాంగములని పేరు. సామంతుఁడు = ఒకదేశము పొలిమేరకు సమీపమున నున్న రాజు. అర్థశాస్త్రము = నీతి శాస్త్రము. అభిమానము = ప్రేమ. యమము = శరీరమునే సాధనముగాఁ గలిగిన యొకయోగము (ఇదిదశవిధము—సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము). నియమము = శరీరముకంటె భిన్నములైనమృజ్జలాదులు సాధనముగాఁ గలిగి నిత్యముగ నాచరింపఁదగిన యొకయోగాంగము (ఇదిదశవిధము—తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము) శిల్పము=పనితనము. పట్టమహిషి = పట్టపుదేవి. మహిషి (నానా) పట్టపుదేవి, ఎనుము. వారిణి = అంపకాలు. పాతకము = మహాపాపము. ఒడిగట్టు = యత్నించు. మందలించు = హెచ్చరించు. నిరాకృత = తిరస్కరింపఁబడిన. నెలకొల్పు = ఉంచు. యుక్తము = తగినది. ఉక్తము = చెప్పఁబడినది. క్షోభము = కలఁత. మడియఁజేయు= చంపు. అసంభవము = కలుగనిది. చితార=పాటపాడుటకై తీఁగలతో నమర్పఁబడిన యొక కొయ్య సాధనము. మ్రోల = ఎదురు. శిరః+ఛేదము=శిరశ్ఛేదము = తలఁగొట్టుట. సేకరింపుఁడు = సంగ్రహింపుఁడు. వైలక్షణ్యము = భేదము. భా. తద్ధి.

---

# వేంగి

టిప్పణము :

ధాతువు = క్రియాపదము. (నానా) గైరిక ధాతువు, పృథివిలోనగు నది, నాడి. ఉత్పన్నము = పుట్టినది. వ్యుత్పత్తి = శబ్దసంభవప్రకారము. కుగ్రామము = వసతులు లేనిచిన్నపల్లె. సస్యసమృద్ధము = పైరులతో నిండినది. హార్మ్యము = మేడ. స్తూపము= మట్టి మొదలగు వానిదిబ్బ. శ్రమణకుఁడు = బౌద్ధసన్యాసి. అగాధము = మిక్కిలి లోఁతైనది. ముక్తి=మోక్షము. సమాధి=తపోనియమము. (నానా) నియమము, ధ్యా

నఘు, మానము, ఓర్పు. దురవబోధము=బోధపడుటకు సాధ్యముగానిది. నిర్వాణము ముక్తి. నిర్యాణము = చావు. సాక్షాత్కరించి = ప్రత్యక్షమయి. శిరసావహించి= తలందాల్చి - ఇదియొక జాతీయము. అంతరించి=నశించి. పురాణములు పదునెనిమిది - బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము. ఇందు వాయు పురాణమును గొందఱు లెక్కించి శైవముపపురాణమందురు. ఉపపురాణములు పదునెనిమిది — సనత్కుమార, నరసింహ, నారదీయ, శివధర్మ, దూర్వాస, కపిల, మనవ, ఔశానస, వారుణ, కలిక, సాంబ, నంద, సౌర, పరాశర, ఆదిత్య, భార్గవ, వసిష్ఠ, మారీచ. యవనులు=తురుష్కులు. సంక్రమించు= చొచ్చు. అగ్రగణ్యులు=శ్రేష్ఠులు. కాదంబరి=ఒకానొక కావ్యము (నానా) మద్యము, ఆఁడు కోవెల, సరస్వతి, మదజలము.



Amirtha Gunabodhini Press, 302, Mint Street, Madras.